సరస్వతీ గ్రంథమండలి: అనుబంధమాలిక ౨౨

# ఆదర్శము

(మొదటి భాగము)

గ్రంథకర్త:

పగడాల కృష్ణమూర్తినాయఁడు



సరస్వతీ గ్రంథమండలి

రాజమహేంద్రవరము

# నిబంధనలు



౧. ఇందుఁ జందాదారుగఁ జేరువారు ప్రవేశరుసుము క్రింద ముందుగా రు ౦—౪—౦ లు చెల్లింపవలయును.

౨. ఇందు రెండేసిమాసములకొక్కటిగ వెలువడుచుండు క్యాలికోబైండుగల ప్రతిగ్రంథమును రు ౧—౦—౦ వెలకుఁ జందాదారులకుఁ బంపుచుందుము.

౩. గ్రంథములఁ బంపుట కగు పోస్టేజి మొదలగు ఖర్చు లన్నియును జందాదారులే భరింపవలయును.

౪. చందాదారులగువారు వెనుకటి గ్రంథము లన్నియును గొనవలయునను నియమములేదు. కాని వారు కోరినచో వెనుకటి పుస్తకములు కూడ, జందాదారుల వెలకే పంపుచుందుము. క్రొత్తగ వెలువడుచుండు గ్రంథములు మాత్రము చందాదారులు తప్పక పుచ్చుకొనుచుండవలెను.

౫. ఇందుఁ బ్రకటింపఁబడు ననుబంధములు చందాదారులు తప్పక పుచ్చుకొనవలయునను నియమములేదు. కోరినవారికే పంపుచుందుము.

౬. సంవత్సరము చందా అనఁగా ముందు ప్రకటింపఁబడు ఆఱుపుస్తకములకు రు ౭—౮—౦ లు ముందుగఁ బంపువారికి ఆఱుపుస్తకములవఱకు ప్రతిపుస్తకమును అన్‌రిజిస్టర్డు పార్సిలుగా పంపుచుందుము. అట్లు పంపినవారికి ఆఱుపుస్తకములకు చెల్లింపవలసిన మనిఆర్డరుకమీషను ౦—౧—౨—౦ లును రిజిష్టరు ఖర్చు ౧—౨—౦ లును రు ౧—౧౪—౦ లు కూడివచ్చును.

సరస్వతీ గ్రంథమండలి : అనుబంధమాలిక

రాఘవరావు సంపాదితము




౨౨

# ఆదర్శము

# ఆదర్శము

( మొదటి భాగము )

గ్రంథకర్త:

పగడాల కృష్ణమూర్తినాయఁడు



సరస్వతీగ్రంథమండలి

రాజమహేంద్రవరము

# మనవి

లోకానుభవముఁ గుర్తెఱిగి లోపముల వెలిఁబుచ్చ నిచ్చగించి వ్రాసిన యీ వ్యాసములఁ జదువుట కింపుగనుండు టకై యందందు హాస్యముఁ జొప్పించితిని.

ఈ నాయుద్యమము మా యాంధ్ర సోదర సోదరీ మణులకు రుచించునని యే నమ్ముచుంటిని. ఈ వ్యాసరచనకు 1931 సంవత్సరాంత్యమునఁ బూనితినిగాని మధ్య యీ యుద్యమమును నిలిపి "నీతిప్రబోధిక" యను పొత్తమును వ్రాసి సరస్వతీగ్రంథమండలి కియ్యవలసినవాఁడనైనందున నీ వ్యాస ములు పూర్తియగుటకు గొంతయాలస్యమైనది.

సర్వేశ్వరుని కృపవలనను, మీ యందఱి యాశీర్వా దమువలనను, పండితుల యాదరాభిమానముల వలనను త్వర లో రెండవపుస్తకముఁగూడ ప్రచురింపఁ బ్రయత్నించెదను.

వ్యాసములఁ జదివి ముద్రింపుమని ప్రోత్సహించిన మిత్రబృందమునకును వినయపూర్వకమగు వందనములు.

నేను బంపిన యీ వ్యాసములనన్నియు నొక్కపొత్త ముగ ముద్రించి ఆంధ్రలోకమున కందఁజేసిన శ్రీ శ్రీ శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామినాయఁడుగారికి నా కృతజ్ఞతాభివందన ములు.

బోర్డుహైస్కూలు<br>చిత్తూరు<br>1—5—34

ఇట్లు విధేయుడు,<br>పి. కృష్ణమూర్తినాయఁడు<br>అసిస్టెంటు.

# విషయసూచిక









కృతిభర్త:

శ్రీయుతులు పొలకల రంగారెడ్డిగారు

# అంకితము



దయాపరులును, ఇంగితజ్ఞులును,

మితవాదులును, శాంతశీలురును,

శ్రీమంతులును, నా శ్రేయోభిలాషులు నగు

## మ. రా. రా. శ్రీ శ్రీయుత

## పాలకల రంగారెడ్డిగారికి

ప్రేమ పురస్సరముగ నీ పొత్తమును

అంకితముఁ గావించితిని.

# ఆదర్శము

## ౧

## గండము తప్పినది

ఆదినము రాత్రి కృష్ణనారదీయము జదువుచు అట్టె నిదురబోతిని. ఆ నిదురలో నొక యూరుఁ జేరితిని. ఆనాఁడా పురమున నెచ్చటఁ జూచినను స్త్రీల సందడి యెక్కువగ నుండెను. నేను జూచుచుండగనే నారీమణుల గుంపొకటి యెచ్చటికో బయలుదేరుచుండె. వారిలోఁ గొందరు కొన్ని పుస్తకములు బట్టుకొని పోవుచుండిరి. ఆపాత్రములలో కొన్నిటిపై పేడనీళ్ళడాగులు—కొన్నిటిపై పులుసునీళ్ళ కఱ్ఱలు—మఱికొన్నిటిపై కుంకుమపుమచ్చ లుండెను. సరే యివి యన్నియు వారి దినకృత్యములలో నేమరుపాటున వాని కభిషేకములు జేసియుందురనుకొంటిని. వా రెచ్చటి కంత శీఘ్రముగఁ బోవుచుండిరో దెలిసికొన కుతూహలమై ఏవాల్గంటి నడిగిన బుగ్గపోటో—తిరస్కారపుమాటో—మర్యాదకులోటో వచ్చునని భయ మొంది వృద్ధాప్యముచే నడువలేక నొక కొయ్య నూఁతఁగొని తానింకను పడుచుదనిపించుకొన వలయునని గాబోలు తా నాకోల నూఁత బెట్టుచున్నట్లు నితరులకుఁ దెలియనీక నడచుచున్న నొక యవ్వగారి వగలనుజూచి నాకు నవ్వువచ్చియు దానిని బైకిఁ దోపనీయక అవ్వా! వా రెచ్చటి కంతత్వరితముగఁ బోవునదియని మెల్లగ నడిగితిని.

అందుల కామె నావంక కుటిమిచూచి "నీకండ్లకావరము కాలి పోను. నేను నీకంటికి వ్వాగ నగుపడితినా? నీకంటె నేనంత ముదు సలినా అని నింక నేమేమో వదరుకొనుచు బోయెను. ఆమె నోట గొనగినమాట లేవో నాకు వినపడలేదుగాని కడపటి మాట మాత్రము పొగరుబోతు బుట్టలు అని వినవచ్చెను. ఏమి విని నాముఖము జేయునదేమున్నది. ఆమె నవ్వాయని నే ననకుండయుండిన నాకిన్ని ముప్పతిప్పలు—మూతివిరు పులు—ఆశీర్వాదములు—మూలుగుశబ్దములు లేకుండెడిది. ఆమె పుణ్యమాయె నన్నామె తన నూతకోలతో దెబ్బతీయక పోయినది. ఇన్నితిట్లు దీసికొనినను తనివినొందక ఆసభ జరి గెడు సౌధద్వారముచెంత బోయి నిలుచుంటిని. లోపలకు బోవుదమనిన భయము బైట నుల్లెయుందమన్న బిడియము, ఏమిజేయుటా యని యోచించుచుండ సభకుఁ బోవలయునని కాబోలు యొక లంబోదరి యేమో మునిగిపోయిన దాని వలె నెగరొజుచు తన స్థూలకాయము నొకవిధముగ సభా కవాటద్వారమునకు దొరలించుకొని వచ్చుచుండెను. నన్ను లోనికి రానిత్తురేమో యీామెనడిగిన బాగని, నవీననాగరి కతా సాంప్రదాయము ననుసరించి వందనపూర్వకముగ సంభా షణ మారంభింపదలంచితిని గాని—ఒక ప్రబలసందేహము— నాసందేశము నామె కెట్లు దెలుపుటా యని, ఆమె ఆంధ్రవధూ టియో—తమిళ తమ్మికంటియో— ఆంగ్లభాష నేర్చబోయి స్వభాషను మఱచిపోయిన సారసాక్షియో—నాకేమి దెలి

యును—ఏది యెట్లయిన గానిమ్ము ఆమెకు నాయుద్దేశము అర్థముగా వలయును గావున ఆమెకుఁ దెలియని యొక్క భాషతో మాట్లాడి ఆమె కర్థము గాకుండ జేయుటకన్న త్రిభాషల నొక్కముద్దగఁజేసి ఆమెతో సంబోధించిన గొంత వఱకైన లాభముండక పోదని "వెడియకాలంత్యాంక్సు (Thanks) అమ్మగారు" అని అంటిని, అందలి మాటలలో నేమాట ఆమెకురుచించెనో గాని ఆమె చిరునగవు నగుచు నన్నుజూచి తలయూచెను. నా త్రిభాష్యవచనాపాటవము గొంత వఱకు లాభప్రదముగనుండుట గ్రహించి "మేడమ్ (Madam) నాన్ ఈసభైకుల్లె పోవచ్చునా, నన్నుప్లీస్ అళితకొండు పోవుదురని మిమ్ములరొంబా (Thanks) త్యాంక్సు చేస్తాన్నాను" అని అంటిని. అందుల కామె బోలెడుత్తర మిచ్చునని యనుకొంటిని గాని ఆమె నొక వింతఠీవితో ఆసౌధము ముందునున్న కొలనుప్రక్కకు తనవ్రేలును జూపి బుడుకున లోనికి బోయెను. అయ్యో! ఇంత తైతక్కగ మాట్లాడినది తుదకొక వ్రేలుజూపునకేనా అని జింతించి అట్లామె ఎందులకా జూపినదని కొంతవఱకుఁ దర్కించుకొనగా! ఆమెగారు నొయ్యారముగ నేడ్చిన యేడుపు దెలిసినది. నావస్త్రములు గొంచెము మలినముగా నున్నవనిగాబోలు నే నా కొలనులో స్నానము జేయనిది ఆ స్త్రీ మహాసభయందు జేర్చరేమో యని ఆ కొలనులోనికి దిగి "ఆడదానిచూపున కెంత యర్థమిమిడ్చితివిరా తండ్రీ" యని ఒక్కమునుగు మునిగి లేచితిని

గదా! ఏమిజెప్పుదును. ఏహే!!! నావిగ్రహము మారిపోయి నది. నూనెమొగ మెరుగని నా పొట్టివెంట్రుకలు తైలయుక్త ముగు దీర్ఘముగు వేణియై పోయినవి. చెవిలో నిగనిగ మెఱయు రవలకమ్మలు—గళమున కంఠహారములు—ముక్కుపై ముక్కర— చేతిలో గోహ్యజహానుగాజులు. అబ్బె! వక్షస్థలమున రామ రామ ఎందులకు లెండివ్వి డీమాటలు—చెప్పుటకు సిగ్గగు చున్నది. ఏహే! నాచొక్కాకు బదులు చీనాసిల్కురవిక— బనియనుకు బదులు బాదమురంగు బాడీ—నాపంచెకు బదులు ఐయిడివన్నె చీర—అయ్యో! ఇది యేటిమాయ, ఇక నాకీ స్త్రీజన్మము దప్పదా! ఆ పాతకి నన్నాసభకు బిలుచుకొని బోనని జెప్పి యుండరాదా! నారదా! నీకుబట్టిన వ్రాతయే నాకుఁ గూడ బట్టినదా! ఊహూ నీవలె అరువదిగాదు ఒక్క బిడ్డనుగూడ గనలేనురా తండ్రీ అని నేను లోలోన ఏడ్చిన ఏడ్పు ఇంతంతగాదు. నన్నుగూడ తన్నంతదానిగ మార్చి వైచిన యా మచ్చెకంటి నాకెదురుగ నిల్చుడున్నచో కాంతా కరవాల, పునర్భవ, వాయనాది ఆయుధప్రయోగానుభవము నాకంతగ యప్పటికి లేకున్నను గొంతివరకైనను నాయోపిన కొలది వానితో శుద్ధిగావింపక విడచియుందునా కావలసినది అయినది. ఇంకెన్ని శూనురాగములీడ్చిన నేమి ప్రయోజనమని సభామందిరమునకుఁ బోవఁదలచితిని. కొలనుకు వచ్చినప్పు డున్న నడక వేరు. ఇప్పటి నడక వేరు. ఎంత బిడియము జెంది బిగించి నడచినను నడుముబెట్టికదలించి గులుకుచు నడచుట

మాన్పలేనైతిని—మగవాఁడుగ నున్నప్పుడు చేతులు కదలించు కొనుచు హాయిగఁ బోవుచున్న నాజన్మమునకిప్పుడు పైటచెరు గప్పుడప్పు సవరించుకొను కర్మమబ్బినది—ఎదురుజూపు తప్ప నన్యమెరుగని నాకు ప్రక్కచూపు—ప్రాలుచూపు—క్రీగంటిచూపులు లభ్యమైనవి——మీసము దువ్వుచున్న చేతికి మెడలోని హారముల సరిచేసికొనవలసిన ట్లయినది—ఒయ్యారముగ చేతి కొయ్య ద్రిప్పుచున్న హస్తము ఒడ్డ్యాణము సర్దుకొనుటకు లోనైనది- గంభీరము తాండవమాడుచున్న ముఖముపై చిరు నగవులు ప్రారంభమయినవి. నేనట్లె సభలోనికి బోయి గ్రిక్కరు మనకుండ నొక కుర్చీపై గూలబడి సభనంతయు నొక్కపరి గలియఁజూచితిని. ఓ—అచ్చట నందరు స్త్రీలె—కొందరు తమిళలు—కొందఱు మహమ్మదీయులు—కొందఱు క్రైస్తవులు ఎక్కువమంది ఆంధ్రులు. సభ అప్పుడప్పుడే ప్రారంభమగు చుండెను. అగ్రాసనాధిపత్నిగ నెన్నుకొనబడియుండిన స్త్రీ యొక కుర్చీయందు గూర్చొని యుండెను. ఆమె చంకనున్న బిడ్డ అప్పుడప్పుడు "అమ్మా తింగర్తు కుకుడే-ఏ-ఏ-ఏ" అని ఆమెను తొందరబెట్టుచుండుటచే ఆమె తమిళస్త్రీ యయి యుండునని యనుకొంటిని. సభ ప్రారంభమయినది. అగ్రాసనాధిపత్ని లేచి నిలుచుండెను. స్త్రీలందరు నైక్యకంఠమున జయ——జయజయ—అఖిలభారతీమహిళామండలికి జయజయ యని అరచిరి. ఇంద రొక్కమారుగ నట్లరచుటచే ముక్కుమొగమెరుగని చిన్నపాపలు తమ తల్లుల చంకలలోనుండి క్యారు క్యారు

మని ఏడ్చుటకు మొదలుపెట్టిరి. ఆరోదనను పూర్తిగ నిల్పుటకు పదునైదునిమిషములకు దక్కవ గాలేదు. తుద క గ్రాసనాధి పత్నిగారి పుత్రికను సముదాయించుటకు ఆమెకు తల ప్రాణము తోకకు వచ్చుటచే అల్లరచినవారిపై యామెకు కోపము ద్విగుణీకరించెను గాని ఏమిచేయఁగలదు! ఆమె మనస్సు చెదరియుండుటచే గాబోలు సీమంతిని, సుశీలలు నే డుపన్యసించెదరని మాత్రము చెప్పి కూర్చుండెను.

సీమంతిని కరతాళములమధ్య లేచి నిలువబడి యీ విధముగ నుపన్యసింప మొదలిడెను. (బిడ్డల భయముచే ఈతూరి వారునోర్లు దెఱచుటకు బిడియపడికాబోలు చేతుల దట్టిరని నాకు బోధపడినది.)

"అమ్మలారా! సృష్టియందు మనదే ఎక్కువ పుట్టుక. పుష్పములకన్న కోమలమగువారమని—లోకము లోని సృష్టి యంతటికన్న యందగత్తెలమని—కలువరేకుల బోలు కన్నులగలవారమని—మందయానులమని—కలకంఠ కంఠులమని—మరాళగమనుల మని—సుకుమారులమని—అబలల మని—లబలబ, ఆ మగవారే, కాదు కాదు కవిపుంగవుల మని పేరు బెట్టుకొనిన పండితులే శ్రీరామనామస్మరణ కన్న నెక్కువ స్మరించుచుండ—తెగబారెడు మీసములు బెట్టుకొని మాకన్న గొప్పవారు గలరే యని నీల్గుచున్నవారు మన క్రీగంటిచూపులలో బంధింపబడుచుండ—యోగీశ్వరులై ముక్కు బట్టుకొని గూర్చొని ప్రపంచ మిక వలదని విడచిన

మహామహులు మన జాతికి దాసానుదాసులై యుండ——ఇక మనకుఁ గావలసిన దేది! మగవా డెట్లు హెచ్చుగును. ప్రపంచమే మన కన్నుసన్న మెలఁగుచుండ మన వాసనలేని పుస్తకములే ప్రపంచమును లేకుండ యుండ ఇక వా రెట్లు ఎక్కువగుదురు——ఒక నిమిషము యోచించితి రా——బ్రతికి నన్ని దినములు వీరికి బండచాకిరీ జేసి చావవలసిన దేనా—— అరుంధతి యని——లోపాముద్ర యని——అనసూయ యని—— వారి జీవితసౌఖ్యములకొరకై కొన్ని నాటకపుబొమ్మల సృష్టిం చుకొని వారు బ్రతుచున్న తెగనీల్గులేమి——మనము చెవులు కోసిన కుక్కపిల్లలవలె వారు చెప్పిన దంతయు వేదమని నమ్మ నగునా? అందువలననే మగవాఁడు వాని యిచ్చవచ్చినట్లెల్ల మనల దిప్పుకొనుచున్నాఁడు. మఱియొక ముఖ్యమగు మాటఁ జెప్పెదను. గమనించుడు.

విష్ణుని వక్షస్థలమున వాలుగంటి——శివుని శిరస్సుపై శీతాంశుముఖి——కమలముపై కలువగంటి——చిత్రాకారుని కుంచెకొనలో చిగురుబోణి——నవలలోనవల——పసారముల లోని విక్రయపటములలో పడఁతుక——నాటకములలో నాతి వర్ణనలకు వనజముఖి——కోవెలలో కోమలి——కథలలో కలికి, గనుటకు గాంత——ఓ ప్రపంచమే మనము, మనమే ప్రపం చము——(వినుడు, వినుడు అని కేకలు) అట్టి మనకును మనపై నాధారపడి యుండు మగవారికిని భేద ముండవలదా! మనలను వారు వారి సమానులుగనైన జూచుచున్నా రా——లేదే——

కారణమేమి. మనవలని ప్రయోజనము వారి కింకను బోధ పడలేదు—మన మందరము వారు జెప్పినటుల జేయుచుండుట చేతనే ఆ మగవాని కింత కొమ్ములు మొలచినవి. పిండ ముడుకబెట్టుట మన పని—లోపము లెన్నుచు నుడికిన పిండ మును లోనికి లెస్సగ దిగవేయుట వారి పని—బిడ్డలు గనుట మన పని—వారిని బాదుట వారి పని—ఖర్చు కాకుండ సంసారముజేయుట మన పని—ఖర్చుపెట్టి సంసారమును గుల్ల జేయుట వారిపని-శుభ్రముజేయుట మనపని—చెత్తబోయుట వారిపని—ఎన్ని అని ఓర్వగలము వీరి ఆరడికి అంతులేదు—తగ్గులేదు—నయములేదు—ఇట్లే యూరకున్న వీరి దుర్నయ ములకు తుదిలేదు—ఇప్పుడే కన్నగడగండ్ల బడుచున్న మనము బ్రతుకగలమా! (బ్రతుకజాలము—బ్రతుకజాల మని కేకలు)

ఆడదానికి ఆభరణములు, అంగు అవి యనిన మన ప్రాణము లట్టె లేచి వచ్చును. ఏమి జెప్పుదును ఇంత సేవ జేసియు వారి కేమైన మనసు గరగుచున్నదా! ఒక నగా—నట్రా—ఒక చీరా—గీరా—వీరి పిండకూడు మనల నిక నేవిధముగ సంతోషపెట్టగలరు—పక్కింటి కామాక్షమ్మగారి కాసులదండ పేరు ముచ్చటకైన కొంచ మెత్తితిమేని—వీరి కర్మము కాలిపోను ఒకచే రొసరొస ఒకచే చిదుముడి—పైకి పట్టించుకండవా దీసినప్పుడున్న తొందర—సతికి సింగపూరు చీర దీయునప్పుడున్నగదా—మీసములకు కప్పువేయునప్పుడు కలిగిన ఉత్సాహము కాంతకు పేస్పవుడరు దీయునపుడు

చూపినగదా !—చేతిలోని కుంగరములు బెట్టుకొనునప్పుడు చూపిన పండ్లిగిలింపు—చిగురుఁబోడి కందెలు గొనునప్పుడు జూపినగదా—ఇట్లని ఎన్ని జెప్పగలను—పాతివ్రత్యమని వీరు మనపై జేయు సవారికి మితిలేదు. మనకు పాతివ్రత్యమనుట నిక్కువముగ మన కుండినచో—వీరికి పత్నీవ్రతము పాటించుట దప్పునా—అప్పుడు వారికి మనము సేవజేయుట వారు మనకు సేవజేయుట తారతమ్యములేక జరిగిపోవునుగదా—మన మిది మొదలు కొన్ని గ్రంథములు సతులకు దాసానుదాసులై వర్తించిన మోక్షప్రాప్తి గలుగునని వ్రాయవలయును, వ్రాసి తీరవలయును, ప్రచురింపవలయును, మొగవారి ముఖముల నెదురుగ బెట్టవలయును, ప్రోత్సహించవలయును.,

'క॥ ధనహీనుడైన గడు దుర్జనుడైన గురూపియైన జారుడైనన్
వినుపాపియైన నెప్పుడు,దనసతియే తనకు దైవతంబుకుమార'

అను నిత్యాదిపద్యములు తాటికాయలంత యక్షరములతో పెద్దపెద్ద కాగితములపై ముద్రించి మొగవాని దృష్టి దగిలెడు గోడలపై—వారి వనితల మేడల గోడలపై—మేజాబల్లలపై—కాఫీహోటళ్లలోని తడకలపై—అంటించవలయును—చిన్నని యక్కరములతో ముద్రించి వారికోట్లకు దగిలించవలయును (కాదు—కాదు అట్లు కాదు చీరలపై నతికించుకొనిన వారిదృష్టి ఆ కాగితములపై బడియే తీరును. అని ఒక అనుభవజ్ఞ అరచెను) అవునది యొక యుత్తమమైన విధమే అని అంగీకరింపక తప్పదు. ఎట్లో ఒకవిధముగ సతీ

వ్రతమహత్యమును గూర్చి వెల్లడింపవలయు. అనసూయ పాతి వ్రత్యమహిమచే త్రిమూర్తులు బాలకులుగ మార్చివై చెనని వారి వ్రాతలయిన, అనూరథుఁడనువాఁడు పతీవ్రతమహిమచే బీదబాలుర త్రిమూర్తులుగ మార్చివై చెనని మనమేల వ్రాయ గూడదు—అరుంధతి పతిసేవాపుణ్యఫలముచే నక్షత్రమండల మున జేరెనని వారి వాదమైనచో అరింధముఁడు సతిసేవా ఫలితముచే సూర్యుఁడై ప్రకాశించుచున్నాఁడని మనవారేల వాదించగూడదు—సుమతి పతి ప్రాణముకొఱకై సూర్యో దయము గానీయలేదని వారి కథలలో నున్నప్పుడు—సుశీ లుఁడు తన భార్య ప్రాణములఁ గాచుటకై చంద్రోదయము గాకుండ శపించెనని మన కథలలో యేల నుండగాదు—నాతి నగలకై నటమట జెందిన నరేంద్రుగూర్చి—కాంత కోకలకై కూడు నీళ్ళు లేక కలఁతఁ జెందిన కల్యాణుని గూర్చి—సతి గోరిన నబ్బుబిళ్ళలకై సందుగొందులు గూడ గాలించి తిరిగిన మహా పురుషునిగూర్చి—భార్య నాలుకకు రుచిగ నుడుకఁబెట్టి వడ్డింప తన జీవితమును ధారవోసిన మహాశయుని గూర్చి— కామినీ కృపాకటాక్ష వీక్షణమునకై చేతులఁగట్టుకొని తపసు జేసిన మగవానిని గూర్చి—పద్యరూపకముగ, గద్యరూపక ముగ, గానరూపకముగ, కథారూపకముగ, నాటకరూపముగ, సంభాషణరూపకముగ "వరప్రసాదిని" అను నొక మాస పత్రిక యారంభించి యందు వ్రాసి ప్రచురింపవలయును. పురు షుల కుచితముగ బంచిపెట్ట వలయును. మఱియొక విష

యము, ఆ పత్రికలో సతికి సేవజేయుచుండునట్లు పతియొక్క ప్రతిమలు, భార్యకచ్చేరిపనిజేయుచుండ భర్త టీకప్పులు త్రెలో బెట్టి దెచ్చునట్లున్న ఛాయాచిత్రములు, పడక సర్దుచున్న పరమపావనుని బొమ్మలు ముద్రించవలయు. ఇంతటితో మన పని సరిపోలేదు. మెల్లమెల్లగ మొగవానిచేతికి మూకుడునిచ్చి మనము రాజ్యాధికారములగూడ బొందవలయు. (అట్లయ్యుట మనకు సాధారణమగుపని గాదని కేకలు) పిచ్చితల్లులారా! మహిళారాజ్యము స్థాపించుటకు మీరందఱు పట్టుబట్టిన నొక్క నిమిషములో స్థాపించగలరు. (ఎట్లు ఎట్లు అని కేకలు) మనకు యుద్ధము లక్కరలేదు. ఫిరంగులతో బనిలేదు. కత్తులతో కార్యములేదు. మందుగుండ్ల మన మంటవలసినది లేదు. బల్లెములు, బాణములు, బాంబులతో బనిలేదు. కేవల మొకటే ఆయుధము. మగవాఁడు ఆడుదానిపై యెన్నియో యుగములనుండి ఆధారపడి వానియంతకు వాఁడు జీవించుటకు మరచినాఁడు, మనకున్నంత నేర్పు, ఓర్పు, వారికి లేదు. వాఁడు ప్రార్థించనిండు, కాళ్ళు బట్టనిండు, కన్నగడగండ్లు బడనిండు, గడ్డము బట్టనిండు, ఏడ్వనిండు, అన్న ముడుఁకఁ బెట్టకుఁడు, బిడ్డల గనకుఁడు, చాలును. అంతటితో వారిపని సరి. వారందరు మన దాసానుదాసులై పోవలసినదే. పై మీసములు క్రిందికి జారవలసినదే. బడాయిపలుకులు బిడాలములనోట బడవలసినదే. ఇంతటిపని మన మందఱు యొక్కసారిగఁ జేసిన జాలును. ఆనాడే మన కష్టవిముక్తి

గాంచినట్లు. ఆనాడే మనకు సర్వమంగళము జేకూరినట్లు. ఆనాడే మహిళాస్వారాజ్యము మన కబ్బినట్లు, వెయ్యేల అంకటి సౌఖ్యదినమునకై మన మండలము ప్రయత్నింపకున్న మన మూఁడవారమని యనిపించుకొనదగమని జెప్పి ఆ మహాశక్తి అట్టె తన యాసనముపైఁ గూలబడెను.

తరువాత అగ్రాసనాధిపత్నిగారు లేచి, సీమంతినిగారు బాగుగనే ఉపవసించిరి—కాదు ఉపసించిరి—కాదుకాదు ఉపనిసించిరి. ఈ దినము రొంబరాత్రి అయిపోయినందువలన సుశీల గారి ఉపవాసము కేకర్తకు మఱియొక దినము మన మందరము వస్తామని జెప్పి ఆనాటికి సభముగించెను. ఇక నాసంగతి శేషించినది. నే నిక యేముఖము బెట్టుకొని నా భార్యను జూచుట, ఆమె నన్ను గుర్తించునా. గుర్తించదే. భార్యయే గుర్తించనప్పుడు స్నేహితులు మాత్రము నన్ను కనుగొనగలరా యని దుఃఖపడఁ జొచ్చితిని. ఆదుఃఖ మెక్కువై ఊఁ, ఊఁ, ఊఁ అని దీర్ఘము దీసితిని గాబోలు. ప్రక్కన బరుండియున్న నా భార్య నన్ను తట్టి లేపి నా కలవరింపునకు కారణ మడిగెను. ఇప్పుడు నాశరీరము జూచుకొనగ నేను మొగవానిగనే నుంటిని గావున గండము దప్పినదని మాత్రము చెప్పి మరల బరుంటిని.

ఓం, శాంతిః, శాంతిః శాంతిః

---

# గ్రహమూ గ్రహచార దోషమూ

కలవు. రకరకములు గలవు. వివిధవిధములు గలవు. అనేక తెఱఁగులు గలవు. అని మాత్రము నేనప్పుడప్పుడు వీరిని వారిని సలాములు (ఒంటిచేతి సగము వందనములు) చేయుచున్నప్పుడు చూచి యనుకొనుచుండెడివాఁడను. సగము వందనమని యెందులకు వ్రాసితిననుకొంటిరా! మన హిందూ సాంప్రదాయము ననుసరించి రెండుచేతుల జోడించి చేసినగాని పూర్తివందనము గాదని యనిపించుకొని నప్పుడు, ఒకచేతితో జేసినది సగము వందనము గాకుండునా! ఒకనాటి యుదయమున వాడుకచొప్పున సంసార తాపత్రయమునకు సాక్షీభూతముగ కావలసినవి గొని కాలబెట్టుట కొక వలసంచిని నెడమ చేతఁ దీసికొని దినదిన మీ ప్రారబ్ధము జీవ మున్నంతవఱకుఁ దప్పదా పరమేశ్వరా యని లోలోన నేడ్చుచున్న నాయేడ్పున కొంచె ముపశాంతిగ, నామమాత్రావశిష్టములుగనున్న నా ప్రతిష్టాగౌరవములకు లోపము రానీయక లోన కుములుచున్న యేడ్పును బైకిఁదోపనీయకుండుటకై కుడిచేతిలోని కఱ్ఱను గిరగిరఁ ద్రిప్పుకొనుచు, కూనురాగముఁ దీయుచుఁ గ్రీగంట నావల సంచిలోని ముళ్లను జూచి యా సంచికిఁ గల ముళ్లును నా సంసారములోని ముళ్లును రెండు నొక్కటిగానే నున్నవి యని యనుకొనుచుఁ బోవుచున్న సమయమున

త్రోవలో నేను జూచినదేమో వ్రాయుదునా! మీరు నవ్వరు గదా! నవ్వినను నవ్వకున్నను—కోరినను కోరకున్నను—చదివినను చదవకున్నను—మొఖమటు విరక్తిభావముచే ద్రిప్పుకొనినను ద్రిప్పుకొనకున్నను—నేను జూచినది వ్రాసియే తీరుదును. నేను జూచిన వింతలేమనెదరా! వినుడు కొంచె మోపికతో వినుడు—మీహృదయముల నిరంతరము దహించి వైచుచున్న సంసార చింతానలమును నొక్కనిముసము యావలకు ద్రోసిబుచ్చి వినుడు—జీవితములలో నిట్టి యువకతవకపు విరుద్ధములు గలుగు నేమో కనుగొనుటకై వినుడు—నేనట్లు జూచినదేమో తెలియునా! మోటారు డ్రైవరొకడు కుడిప్రక్కనకు బోవలయునని దెలుపుటకై చేయిజాపినది జూచి ప్రక్కననున్న యొక మంగలి, డ్రైవరు తనకే ఆసలాము జేయుచుండెనని బదులు జేసిన సలాము—చిటికిలోని పొడినివేయ తనచేతుల ముక్కుల వద్దకు తీసికొనుచుండిన నొక పల్లెటూరాతనిజూచి ఒక పండిత యువకుడు తన కతడు సలాముజేయుటకే జేయి యెత్తుచుండె నని తనచేతినిగూడ పైకెత్తి యింతలో ఆతడు పొడి వేయు చుండుటజూచి యెత్తినచేయిని క్రిందికి దించిన యువమానమును నెత్తి గోకికొనునటుల నటించి తనపరాభవమును నొకవిధముగ నుపసంహరించుకొనిన సలాము—జోబిలోనున్న బీడీముక్కను దీయవలయునని కాబోలు నొకసాహేబు తనచేతిని పైకెత్త, యెదుట నిలచియుండిన శాస్త్రుర్లు యా సాహేబు తనకు సలాము జేయుచుండెనని దలచి తానుగూడ ఆశీర్వాదపురస్సరముగ

జేసిన సలాము—తల గోకికొనుటకు చేయి పైకెత్తిన ఒకముదు
సలివానిని జూచి ఒక ముట్టికాళ్ళవాడు తనకు సలాముజేయు
టకే ఆవృద్ధుఁడు జేయి యెత్తుచుండెనని జేసిన బదులు సలా
ము—దూరముననున్న తనకుమారుని బిలుచుటకు తనచేయి
పైకెత్తుచుండిన శెట్టిని దాపున నున్న యొక సనాతనుఁడు
జూచి యాతఁడు తనకు సలాముచేయుటకై చేయి యెత్తుచుం
డెనని తలచి తానుకూడ చేయి నెత్తితుదకు శెట్టి తనకుమా
రుని బిలుచు టెఱిగి యెత్తినచేయిని దవడ గీరుకొనుటకే
యుపయోగించుకొనునటుల నటించిన సలాము—నెత్తిపైనున్న
కట్టెలమోపును సరిగ బెట్టుకొనుటకై చేయి పైకెత్తిన కట్టె
లమ్ము వానిని జూచిన యొక కసుసాలి అతడెందులకు తన
చేయి నెత్తెనో గమనించకయే శిఖితోఁ జేసిన బదులు సలా
ము——పాపము నరములపీకుడుచే చేయి నప్పుడప్పుడు
పైకెత్తుచు దించుచుండు నొక బొందెలవానిని జూచిన నొక
బాల భటుఁడు నిజముగ నతఁడు పలుమారు సలామతనికేఁ
జేయుచుండెనని—మతాడువ్రేళ్ళ జూపుచు యాతనికిఁ జేసిన
సలాము—నలుగు రొక్కటిగఁ బోవుచుండగ యెదురుగ వచ్చు
చున్న నొకఁ డెవనికో కొంచెము దూరమున నున్న వానికి
జేసిన సలామునకు వీరిలో యొకఁడు ఆసలాము తనకేనని
మరల సలాము జేసి తుదకా గౌరవము తనకుఁ గాదని తెలిసి
కొని తన తోడివారది కనుగొని పరిహాసింపకుండునట్లు వారిని
నేదో విధముగు మాటలలో దింపిన నికృష్టపు సలాము—జారు

చున్న రుమాలు సరిజేసికొనుటకై యెత్తుచున్న నొక దొమ్మరి వాని చేతినిజూచి యెదురుగ వచ్చుచున్న నొక జాతి దొర జేసిన బదులు సలాము—నిశ్చయముగ చేసిన సలామునకు బదులు సలాము రానందుచే యింతటి యవమాన మెటుల భరించుటయని ముఖము వెలవెల బోయిన సలాము—ఒకతూరి జేసిన సలామునకు బదులు లేనందుచే యెదుటి యాతఁడు చూడలేదేమో యని అత డేప్రక్కకు దిరిగిన ఆ ప్రక్కకు బోయి అయ్యా సలాము, అయ్యా సలామని యొత్తుకొను చున్న సలాము—ఇట్లే ఇట్లే—అనేకవిధములు జూచితిని. ఔరా! ఈ సలాము లెంత సరసము—యెంతచొక—యెంత నయము—కరము కదిలించిన కేలుమోడ్పున కేనా—చేయి చలించిన చేమోడ్పున కేనా—సలామున కర్థమే లేకుండ బోయెనే! లేకున్న నేనుజూచిన మోటారుడ్రైవరుకును మంగలికిని యేమంతమచ్చిక—పల్లెటూరాతనికినిపండితయువకు నకును యేమంతపొత్తు—సాహేబునకును శాస్త్రికును యేమంత సమ్మేళనము—ముదుసలికిని ముట్టికాళ్ల వానికిని యేమంత మంతనము—శెట్టికిని సనాతునికిని యేమంత స్నేహము—కట్టెలమ్మువానికిని కంసాలికిని యేమంతకూరిమి—బొందెలవానికిని బొలభటునకును యేమంత భ్రాంతి—దొమ్మరికిని దొరకును యేమంత దోస్తీ లేదే—ఒకరిమో మొక రెవ్వడైనను జూచుకొనియుండిరా! మాట్లాడుకొనియుండిరా! కాసంత ముందువెనుకలు జూచుకొనియుండిరా—

యెట్లు జేయుట దెలిసికొనవలసినపనియే లేదా—గౌరవమును దెల్పునట్టిసలామునకు—మర్యాదను వెలిబుచ్చ నేర్పరచిన యీ సలామునకు—యెదుటివానిలో పైకగుపడుచుండు కంకాళమునకు గాకున్నను అతనిలోనున్న తేజస్స్వరూపమునకుభక్తిపురస్సరముగ యర్పించు వందనమని దెలుపు యీ సలామునకు—ఒక్క మానవుని ఔన్నత్యమును వెలిబుచ్చునటుల జేయు యీ సలామునకు—వినయాదిసద్గుణములఁ దోపఁజేయు యీ సలామునకు—ఎన్ని ముప్పాతిప్పలు వచ్చినవి. సలామను పదమునకు అర్థమే దెలిసికొనవలసిన బనిలేదా! కాలము మారినది. కాలములోని నియమములు మారినవి యని యనెదరేమో! ఔనౌను. ఆ విషయమును ఒప్పుకొనకతప్పునా—లోన గుండమంత దావానలము బెట్టుకొని పైకి పండ్లికిలించుచు చేయియెత్తి గుడ్ మార్నింగుయని యనినదీసలామే—లేనిపోని గౌరవము బొందవలయునని బలవంతశ్రాద్ధముగ బెట్టించుకొనినవందనమూసలామే—నీ వెప్పుడుజత్తువురా చచ్చుపీనుగా యని లోన యనుకొనుచు పైకి కేలుమోడ్చిన దీ సలామే—అందరూ నాతనికి వందనము లర్పించుచుండ నే నూరకుండ రాదని యిచ్ఛలేకుండఁ జేసిన దీ సలామే—భక్తియుతముగ జేసిన దీ సలామే—దూదేకులసాహెబునకు మొదలు దేవుని వఱకును తనకు దెలియకనే చేయి యాడించుటయుసలామే—గుడిలోస్వామికిబెట్టినదియుసలామే—గుడ్ మార్నింగు కుమారా అనుటయు సలామే—గుడ్ నైట్ మైడియర్ అనుటయు సలామే—

యెదుటమనిషి బడినపుడు నిమీలిత నేత్రుండై చేయి పైకెత్తి పరవిత్తాపహరణభావంబుచే తన్మయుండై చేయుటయు సలామే ఆహాహా!! ఇందులో నిజమగు సలా మేదో నిడదవోలు సలా మేదో—కపటమగున దేదో కపటములేని దేదో—ఎక్కువ దేదో తక్కువ దేదో—సరసమైన దేదో—సరసహీనమైన దేదో—భావయుక్తమైన దేదో— భావరహితమైన దేదో — మానవునకుం జేసిన దేదో మాధవునికిం జేసిన దేదో—యేది దెలిసికొనుటకును వీలులేక పోయెనే, మితముగ కారణ యుక్తముగ, సహేతుకముగం క్లుప్తముగం జేయవలసిన యీ సలాములు మానవుల జీవితములలో నుదయము నిద్రలేచినది మొదలు రాత్రి నిదుర బోవువఱకును ఒక టేచేయి యాడించుటైపోయినదిగదా. ఇంటి ముందునకు వచ్చిన సలాము—ఇంటివెనుకకుంబోయిన సలాము —మేడ మెట్లెక్కినప్పుడు సలాము—మేడమెట్లు దిగునపుడు సలాము—రోడ్డుమీద సలాము—రోడ్డుప్రక్కన సలాము—భుజించునపుడు సలాము—పండుకొనబోవునపుడు సలాము—మాట మాట్లాడిన సలాము—మాట్లాడకున్న సలాము—లోక మట్లయినది.

దారియందొక గుమాస్తాను జూచితిని. అతఁడు పలుమారు తన చేయిని పైకిని క్రిందికిని యాడించుచుండెను. పాప మతనికి చేతిలో నేమిబాధోయని విచారించుట కతనిని బిలచి యేమయ్యా! పలుమారు చేయినట్లు జాడించుచున్నావు. ఆ నరములపీకుడుబాధ కేదైన మందు జూచుకొనలేకపోతివా

యని యంటిని; అందుల కాతఁడు నా కేమియు [illegible] కాని యీ సలాములపోరు తప్పించుకొనుటకు [illegible] మానము సలాములు చేసిచేసి నాకు చేయి [illegible] కైపోనది. సలా మెప్పుడు జేయవలయునో [illegible] గూడదో యను బాధ నా కిపుడు లేదు. [illegible] వారు యెవ్వరైనను వచ్చినప్పుడు మాటమాటకు [illegible] జేయుచుండవలయు ననియు దానిపైననే [illegible] మాధారపడి యుండుననియు అట్లు తప్పినంతట [illegible] లేక పనికి స్వస్తియో జెప్పెదనని గట్టిగ [illegible] నా చేయూడింపే నీకంత యాశ్చర్యముగఁ దో[illegible] నేను జూచినవి జెప్పెదను. ఒక నాటకమున [illegible] అచ్చట దశరథపాత్ర ధరించినవాఁడు రామచం[illegible] ధరించిన వ్యక్తి లోనికి వచ్చుచుండ హాలో; మైడియర్ [illegible] గుడ్ నైట్ అనిచేయి పైకెత్తి సలాముచేసి [illegible] తప్పును కనుగొని సభవంక వెలవెలఁబోయి [illegible] మఱియొకతూరి ధ్రువవేషము వేసిన వ్యక్తియొకఁడు, [illegible] విష్ణువేషము ప్రత్యక్ష్యమైనవుడు రెండుచేతులఁ [illegible] స్కరించుటకు బదులు గుడ్ యీవినింగ్ సార్ [illegible] వచ్చారని ఒక సలాము గొట్టి, తెరచాటునున్నవాఁడు "[illegible] మండా నమస్కారము చేయక నల్లబొగ్గులసలా మేమిటి[illegible]" యని యరచెడివేళకు తన తెలివిలేనితనము జ్ఞప్తికిఁ దెచ్చుకొని మరల అడియేనని, హే పావనమూర్తీ యని యేవేవో [illegible]

లోడ వదిరినాఁడు. ఇంకను జెప్పెదవినుము. ఒక పూజారి మూలసామ్రాట్టు ముందుగూర్చుండి ఓం, కేశవాయనమః, ఓం మహేశ్వరాయనమః, ఓం గుడ్ మార్నింగాయనమః అని ఒంటిచేయిని పైకెత్తి సలాముచేసి ప్రక్కన పూజాద్రవ్యముల తట్టలలో బెట్టుకొని నిలచియున్నవారిని జూచి బిడియముతో తల క్రిందికి వంచుకొనినాఁడు. మఱియొక బ్రాహ్మణుఁడు ఒక చెలిమవద్ద, శ్లో॥ అనంతగుణరత్నాయ విశ్వరూప ధరాయచ అర్ఘ్యందదామతే దేవ, నాగాధిపతయే, గుడ్ మార్నింగాయనమః, అను ప్రార్థన శ్లోకములో గూడ గుడ్ మార్నింగను మాట మఱచినవాఁడుకాఁడు. మా యజమానుఁ డప్పుడప్పుడు రాత్రులలో గుడ్ మార్నింగు గృహిణీమణీ యని యొకసారి—గుడ్ నైట్ నాయనా——యని మఱియొకతూరి కలవరించి తన చేయిని పైకెత్తి ప్రక్కననున్న తన కుమారునిపై విసరి వేయగా వాఁడు చచ్చితినిరా బాబూ అని యఱచుచు మేల్కొనుచుండును. పాకివాఁడైననసరే— పారావాఁడైనను సరే—పాములఁబట్టువాఁడైననుసరే— పాషండుఁడైననుసరే—చిన్నవాఁడైననుసరే — చీరగట్టినదైననసరే — జీవములతోఁ గదలుచున్న మనిషిమాత్రుఁడైననసరే—బాలుఁడైననుసరే — యెదురుపడిన చాలును మన యాజ్ఞకూడ లేకుండనే యీ పాడుచేయిపైకి లేచి తన స్వాతంత్ర్యమహిమను వెలిబుచ్చుచుండును. లోక మట్లు మారిపోయినది. సలాము తనకే చేయుచుండిరని కొందరు భ్రమించి పోవుచున్నారే. ఒక్క

విషయము గమనింపవలసిన పనిలేదా, యేమంత యేడ్చి పోయిన గొప్పతనము, ఘనత, ప్రతిష్ట తనలోఁగలిగి అంతటి గౌరవమునకు యర్హుఁడనా యని యనుకొనబనిలేదా. ఇంకను కొంతమంది మహనీయుల విషయము ముచ్చటించెదను వినుము. సలా మంగీకరించువారి వంచుకొనియున్న తమ తల యప్పుడే కొంచెము పైకిలేచును. క్రిందిచూపులు పైవి యగును. చుట్టుప్రక్కలనున్న వారగపడనంతటి వైద్య చికిత్సాతీతమగు తృటికాలపు అహేతుక యంధత్వ మొకటి బయల్పడును. బదులుసలాము జేసిన తమ గౌరవమునకు లోప మని యేదిక్కునకో తలను ద్రిప్పుకొనువారు కొందరు—చూచియు చూడనట్లుండువారు కొందరు—వ్రేలునుమాత్రము యితరుల కగుపడనీయక మెల్లగ పైకిని క్రిందికినితొండ తల నాడించినట్లు యాడించువారు కొందరు—గయ్యాళిగంప యగు భార్య పతినిజూచి తన తలను యాడించునట్లు యాడించువారు కొంగరు—చేతికర్రను భూమిమీదనుండి యెత్తినట్లు నటించు వారు కొందరు—మాకు సలాములు బెట్టువారు లేరేయని యేడ్చువారు కొందరు--బెట్టిన సలామునకు బదులుసలాము రాలేదని వగచువారు కొందరు—సలామునకు మారుబెట్టిన తమగౌరవము చెడునేమో యని కుందువారు కొందరు—ఇట్లు విధవిధములు గలరు కాని, పెద్దగాని చిన్నగాని, భాగ్యవంతుఁడు గాని బికారిగాని, యెవరుగాని, పెట్టిన సలామునకు (వందనమునకు) మారు జేయకుండుటకన్న వేరు

పాపము గలదా యని చింతించువారు లేరు. వందనము జేయుట, వానిలోనున్న వ్యక్తిత్వమునకుఁగాని యెముకలగూటికిఁ గాదే—వానిలోనున్న వినయాది సద్గుణములకుఁగాని, కుళ్లిపోవు శరీరమునకుఁ గాదే—యెదుటివానిలోని పరమాత్మ స్వరూపమునకుఁగాని పాపపంకిల సమన్వితంబగు శరీరమునకుఁ గాదే—అది యట్లుండనిమ్ము—మా నాయన ఒక యధికారివద్ద పనిలోనుండెనట. ఆతడు భార్యాసమేతుఁడయి యున్నపుడు వంగి వంగి సలాము జేసిన యెంతటి గొప్పకార్యమైనను సరి చేయఁగల బుద్ధి యాతనికుండెనని గ్రహించి సమయమెఱిగి సలాములుచేసి తన కార్యములు సాఫల్యము చేసికొనుచుండెనఁట, తెలిసినదా! ఇది మనపాలిటి గ్రహమో గ్రహచార దోషమో దెలిసినదికాదే! నీ వింక బొమ్ము. నాకు యింక నెక్కువపను లున్నవని యాతఁడనుటచే అచ్చటనుండి బోవు చుండగ నొకఁ డెదురుపడి నా ముఖమున ఒక నోటీసు కాగితమును యెగురవైచి రివ్వునబోయెను. నేనా నోటీసును జూడగ నందినట్లు వ్రాయబడియుండెను.

నోటీసు

నేటిరాత్రి 10 గంటలకు, సేలము సారసాక్షి సభ వారు రావణ సంహార మను నాటకమును అరవమున అతి విమర్శగ ప్రదర్శింతురు. రండీ! వచ్చిచూడండీ!! వచ్చి సంతోషపడండీ!!! ధారాళముగా యుండు డబ్బును ధారాళముగా వెలవు సేసి కండ్లకు శృంగారము సేసికొని పంచేంద్రియములతో ఆనందపడండీ——

వచ్చుచున్నారు. యెవరు ? యెవరు ? వచ్చుచున్నారు. ఈ దేశములో బహుదినములుగా ఎదురుచూచుకొనియుండిన ఆడ మొగ మనుష్యులు వచ్చుచున్నారు. కలియుగములో దిక్ విజయము చెంది గ్రామఫోను ప్లేటులో అనేకపాటలుపాడి భంగములేని సింహము ఎదిరించి భంగారు తోడా బహుమదిగా పొందినవారు వచ్చుచున్నారు.

ఇందువచ్చు నటుకులు

గానకోకిల సంగీత సాహిత్య శిరోమణివర్ జగదీశ్వరం గారు—రాముడు.

వీర ధీర చండమార్తాండ దిగ్విజయశేఖర—ఆళవందారు గారు—రావణుడు.

రంగమార్తాండ గవాయిగపూర్ ఖానుగారు—లక్ష్మణుడు.

సినిమాటాక్సీ పార్సిబూట్ సంగీతరాణి చంద్రోదయా మిస్ విమళ వేణి—సీతాదేవి.

జాలిహార్మోనియం రాణి సుఖశారీర మిస్ కోమళాం బాల్—హార్మోనియం.

పై పెద్దజతలకు పోట్టాపోటీచేసి పందయము విడువబడును.

ఓ ఘనధనవంతులారా ! అనేక ద్రవ్యము సెలవుసేసి అనేక జలప్రదేశములలో కీర్తిశేషులైనవారిని తెప్పించయున్నాము. స్థలము ముంబాడి చూచుకొనుడు.

టిక్కెట్లవివరము నాటకహాలులో దెలిసికొనుఁడు.
సర్వసంగ్రహా సోమయ్య అవర్‌గళ్
మేనేజింగ్ డైరక్టరు

నోటీసే యింత హృదయానురంజకముగ నున్నప్పుడు నాటక మెంత నవ్వులాటగ నుండవలయునో యనుకొని మరల నోటీసు జదువ మొదలిడితిని. జదువునప్పుడు నాకుఁగలిగిన యనుమానము లెట్టివో మా చదువరులకుఁగూడ దెలిపికొందును "ధారాళముగానుండు డబ్బును ధారాళముగా ఖర్చుచేసి" యని, ధారాళముగ డబ్బు ఈకక్కుర్తికాలములో యెవరికిఁ గలదు? అన్నమో రామచంద్రా యని వగచుచున్న యీ కాలములో డబ్బు యెచ్చటఁజూచినను ధారాళముగ బడియున్నదా! ఆనాటకాధిపతికి ధారాళముగనే డబ్బు దొఱకుచున్నది. గావున యట్లు వ్రాసి నేమో, తరువాత "కన్నులకు శృంగారము సేసికొని యనియున్నది. కన్నులకు శృంగారము చేసికొనుటయెట్లు? నాటకములవారు కన్నులకు చెవులకు యానందము గలుగజేయుదురుగాని మిగిలిన యింద్రియములగు చర్మము, నాలుక, ముక్కునకు యెట్లు సంతోషముఁగూర్పఁ గలరు, కాదే! ఒకవేళ ఈ నవీననాటకములో చర్మమునకు గంధము, నాలుకకు రుచిగల పదార్థములు, ముక్కునకు సువాసన గల పువ్వములనిచ్చి మిగిలిన నింద్రియత్రయమును మోసికొని వచ్చిన కష్టమును రిత్తబోసేయక జేయుదురేమో యే మేమి రహస్యములు దాగియున్నవో యెవరికెఱుక తరువాతమాట

యేమి? "గానకోకిల" యని ఓహోహో? కోకిలలో గానకోకిలని, గాడిదకోకిలలని, ఏడ్పుకోకిలలని యిన్నివిధము లున్నవా! ఆనటుఁడు మనిషిమాత్రుఁడుగాక గానకోకిల మను పక్షియో లేక నిరక్షరకుక్షియో లేక మొద్దుస్వరూపమగు సిడిముడిరాయుఁడో లేకున్న యిట్టి యర్థములేని బిరుదము బెట్టుకొనునా! మరల వచ్చు పాత్ర "వీర ధీర చండమార్తాండ దిగ్విజయ శేఖర" యని పేరునుబట్టి చూడ ఇతఁడు హిరణ్యాకశిపుని జేజినాయన కన్న మిక్కుటముగ నున్నట్లున్నది. ఏయే రాజ్యములు జయించిన మహాప్రభో! ఐరోప మహాసంగ్రామములో—బర్మాయుద్ధములో—ఫ్రాంటీయర్ పెనుగులాటలో—నలుగురి ప్రాణములు దీసినాడా అట్లున్న మనకీ వీరచక్రవర్తిపేరు వార్తాపత్రికలలో నొకటిలో గాకున్నను మఱియొకదానిలోనైనను యగుపడి యుండదా కాదు! కాదు!! అట్లుండదు. నాదే పొరపాటు. అట్లుండిన ఈమహామహుఁడు నాటకముల లోనికి దిగునా! ఈతఁడొకవేళ పైయుద్ధములలో పీనుగుల మోతగాఁడో, అశ్వరక్షకుఁడో, రొట్టెలభక్షకుఁడో యేదో యొకటయి యుండవలెను. ఈశూరాగ్రగణ్యుడు రాత్రి కెచ్చట నాటకరంగమును రణరంగముగ మార్చివైచునో గదా! పాప మా మేనేజరంత తెలివితక్కువవాఁడా! యుద్ధప్రియులను నాట్యమందుఁ జేర్చునా! అతఁడు రెండవరకములోనే జేరియుండవలయు ననుకొంటిని. సరే మరియొకపంక్తి "గవా

యిగవుూర్ ఖాను లత్శ్మణుఁడని" సాహేబుగారు హిందూసాం ప్రదాయానుసారముగ సహోదరప్రేమ ముట్టిపడ నటించు టేమి? గవూరుఖాను గయాసుద్దీనుపాత్రనో, గులామల్లీ పాత్రనో చక్కఁగ అభినయించియుండును గాని యీ ఖర్మమేమి? ఒక వేళ నిజముగు లత్శ్మణపాత్రపోషణముఁ జూడజాలక పోయినను హాస్యపోషణమునైన జూడవచ్చు ననుకొంటిని. తరువాత "పార్సీబూట్ చంద్రోదయ" విమలవేణి సంగతి. పార్సీ బూట్ అనగా నా కేమో యర్థమగుటలేదు. ఆ వేణీగారు పార్సీబూట్ యేమైన ధరించి వచ్చునేమో అయిన ఆ విషయమునుగూర్చి యెందులకు నోటీసున వేయవలయును. ఒక వేళ ఆమె పార్సీబూటంత అందముగ నుండునేమో! ఎంత యందముగనున్నను బూట్తో అందమును సరిపో ల్చుకొనెదరా! ఇది యెక్కఁడివింత! అట్లుండదు. ఒక వేళ ఆమె పేరు పార్సీబూట్ విమలవేణియా! ఇది ఎక్కఁడి అన్యాయము. బూట్ అను పేరుండదు. తాళుఁడు. కొంచెము కొంచెముగ అర్థమగుచున్నది. ఓహో! తెలిసినది. పార్సిబ్యూటి అనుటకుమారు పార్సీబూట్ అని యేడ్చియుం డవచ్చును. మరల వచ్చునట్టి "హార్మోనియంరాణి" ఇది చాల క్రొత్తపదము. మనుష్యుల పరిపాలించిన మహాతల్లికి రాణి యనుచున్నాము గాని యీ నూతన యేడ్పేమి? హార్మో నియం బాగుగ వాయించిన మాత్రమున హార్మోనియంరాణి యగునా—ఆ పేరు చక్కఁగా నున్నదా—అట్లగుచో పర

దాలు చక్కఁగ దించుటలో పైకెత్తుటలో నిపుణుఁడుగ నున్న వాఁడు పరదాల ప్రెసిడెంటని, పిటీలు చక్కఁగ వాయించువాడు పిటీల పుడమిరాణుఁడని, కర్టన్లు చక్కఁగ మెత్తి దించుచుండిన కర్టన్ల కాణాచియని, దీపములు బాగుగ బెట్టుచుండిన దీపముల దొరయని, తాళము చక్కఁగవేసిన తాళముల తారా చున్నాయని, మృదంగము చక్కఁగ వాయించిన మృదంగవు మృగేంద్రమని, వెనుకపాట బాగుగ పాడిన వెనుకపాటల వైస్ ప్రెసిడెంటని, నాట్యము బాగుగ నాడిన నాట్యముల నాగమల్లియని, హాస్యము బాగుగఁజేసిన హాస్యముల హంసయని, రాగము బాగుగా పాడిన రాగముల రాజని రాయియని, రప్పయనియు పేర్లు బెట్టుకొనవలసినదేనా? శబాష్! క్రొత్త మోస్తర్లు ప్రచురణమే యని క్రిందిపంక్తిని జూచితిని. మఱల నొకఖర్మ యగుపడినది. "జలప్రదేశములలో కీర్తి శేషులైన" యనిన యర్థమేమి? జలప్రదేశములలో కీర్తిశేషులైనవారిని వీరు యేమృతసంజీవినీ మంత్రము పఠించి దెప్పించిరోగదా! నీటిలోమునిగి చచ్చినవారినే యీదినము నాటకమునకు దెప్పించియుండిన యింక భూప్రదేశములలో కీర్తిశేషులైన వారి బంధువులందరు వారిని ప్రార్థించి బ్రతికించుకొని యుండరా! అట్లుండదు. ఒకవేళ జలప్రదేశమన సముద్రమున కావల నున్న దేశములలోను, కీర్తిశేషులైన యన కీర్తిమంతులైన అని వారి రోదన యుండవచ్చునేమో అని యనుకొంటిని. తరువాత కడపటిది "టికెట్లవివరము, హాలువద్ద తెలుసుకొన

వచ్చునవి” ఒకవేళ భారమునుబట్టియో లేక బలుపునుబట్టియో రేటు వసూలుజేయుదురేమో! మొత్తమునకు యేదో యిది యొక వింత ప్రదర్శనముగనే యున్నదే! వారెట్లు రేట్లు నిర్ణయించినను నేను పూసరవల్లి మహాశయులలో యగ్రగణ్యుఁడ నగుటచే నాటకమునకు బోయిన అంత యిబ్బందిపడవలసిన పని యుండదనియు నోటీసే యిన్ని వక్రములు గలిగియున్నప్పుడు నాటక మింకెన్నిగతులు బట్టునో చూచియే తీరవలెనని నోటీసు మరల మరల చదువుకొనుచు పదునొకండుగంటలకు యింటిలోనికి వచ్చియు రాకమునుపే నా భార్య యెదురుగావచ్చి ఇంతసేపు పట్టినదా మీకు కూరగాయలుకొనుటకు? బండ్లకొలది వ్యాపారము జేయుచుంటిరా? ఈ వేళకుఁ దెచ్చిన నేను వేళతప్పకుండ యెట్లువండి పెట్టఁగలను? ఏదీ యేమేమి తెచ్చితిరి యని యడిగెను. అప్పటికి నాకు కూరగాయల సమాచారము జ్ఞప్తికివచ్చి తెల్లబోయిన ముఖముతో నా భార్యకేసి చూచి చేతిలోనున్న యుత్తవలసంచిని క్రిందఁబడ వేసితిని. ఓహోహో! తెలిసినది. మీరెచ్చటనో మాటలకుఁగూర్చొని యుత్తచేతులతో వచ్చితిరిగదా! ఈ దినము యేమి వేసుకొని తినెదరు యని నా భార్య వంటయింటిలోనికి గబగబ పరుగెత్తెను.

యెన్ని యిబ్బందులుండినను ఆ దినము రాత్రి సరిగా పదిగంటలకు నాటకశాలఁజేరి స్త్రీజనమున కేర్పఱచిన స్థలమునకు సమీపమున చోటుండుటచే అచ్చటఁగూర్చుంటిని. నా

కుడిప్రక్కన నుండిన ఒక లావుపాటి మనిషినిచూచి, తమ పేరేమి యని యడిగితిని. ఆతఁడును "యన్ పేరా సాంబసదా శివమొదలియారు, వునక్కుయెన్నాతుకయ్యాయెర్ పేరని గద్దించెను. ఏమిలేదండి యూరక అడిగితిని మన్నింతురని నే నేనంటిని. ఇంతలోనే నాటకశాలలో ఒక పెద్దగోల బయలు దేరెను. వూలవేయువారు కొందరు—చప్పటలుజరచువారు కొందరు—పదిన్నరయయికూడ ఆట యారంభముకాలేదే అని కొందరు—యెన్నాడాకమ్మినాటి కానువాంగిలియా— యెవళనేరము వుక్కాందియిరుకరదని కొందరు వుళ్లేపోయి అంద పొప్రయిటర్ను మూంజీమేలే అడిడా అని కొందరు— పలుపలువిధములపెద్దరబ్బసముచేయఁజొచ్చిరి. ఇంతలో ఒకఁడు ముఖమునకు మసిఁబూసికొని తెరబైటికివచ్చి అరవమున వుప న్యసించుట కారంభించెను. నా కర్థము గానందుచే మాసాంబ సదాశివ మొదలియారుగారిని "ఆయన జెప్పునవేమో జెప్పె దరా యని యడిగితిని. అందుల కాతఁడు నన్ను మ్రింగివేయు వానివలె నుఱిమిచూచి, యెన్నాఁడాయిందశన్నై, బణ్ణుంకేళ్ కాదేపఱ్ణా, తమిళ్ తెరియాదవన్ యేంయింగెవంది అయవు ణం యని గద్దించెను. ఆతనిగద్దింపుకు నా యెడమప్రక్కన నున్న యొక యరవముదెలిసిన యాంధ్రమహాశయుఁడు నన్ను బిలిచి నీకు నే నన్నియు వివరించెదనని జెప్పెను. కావున మా ఆంధ్రసోదరుఁడు వివరించిన మేఱకు చదువరులకు నేను దెలిసి కొనిన యంశములన్నియు తెనుఁగుననే వివరించెదను. అచ్చ

టచ్చుట హాస్యము ప్రకటించు అరవపదములున్న అట్లే వ్రాయుదుము, చదువుదుము.

తెరకుముందు మాట్లాడియుండిన మసిముఖపు మనిషి ఇట్లు చెప్పఁదొడఁగెను. ఘనసభవంతులారా ! మాకీయూరు క్రొత్తయగుటచే భోజనాది సదుపాయములలో కొంత యిబ్బంది గలుగడము వలన ఆట యారంభించుట కాలస్య మైనది ఈ యూరిలో వేషములకు తగిన డ్రెస్ దొఱకునని కొండంత యాశతో వచ్చితిమి కాని బొంబుగ విషయములో మాకు కుదిరినది కాదు. అందువలన మాకున్న స్వల్పడ్రస్సు తోనే సర్దుకొందుము. మీరు తప్పక మన్నింతురని ప్రార్థించు చున్నాను. ముఖ్యమగు విషయ మేమనగా మా సినీమానటి యగు విమలవేణికి కొంచెము తల నొప్పిగా నున్నది. గావున తన యద్భుతసామర్థ్యముఁ జూపుట కంతయదను కాదనుకొని యెదను. మీరు మాకు తండ్రులు. మేము మీకు కొడుకులము (మాలో యెవరికిరా నీవు కొడుకని ఒకచెనటి అరచెను) అయ్యా నమస్కారములు బిడ్డలుఁజేయు లోపముల అని యేమో యింకను చెప్పఁబోవునంతలో ఒక మూలనుండి యొకఁడు లోపములు సరిదిద్దుకొనకనే యింతదూరము యెందులకు వచ్చితివిరా లొట్టవ్యధవా ! అని కూసెట్టెను. మఱియొకడు యింక చాలును లోపలికిపోరా "వెఱ్ఱిమొగమా" అని అఱచెను. ఒక సాహెబు "జావురే హైవాన్" అని గీపెట్టెను. నా ప్రక్కనుండిన మొదలియార్ "ఉళ్ల పోడా

జేమూసీ" అని గద్దించెను. ఈ బొబ్బరింపులకు వాఁడు మారు మాట్లాడలేక లోనికిఁబోయెను. ఆట ఆరంభమయినది. మొదటి తెర తెరువఁబడిన వెంటనే హార్మోనియము రాణీపై నాకన్నులుబడెను! ఆమె హార్మోనియము రాణీగారు కాదుగాని అడ్డబలుపుల రాణీయని యనిపించుకొనదగినది. యామె చేతులు గల నొక కుర్చీపై గూర్చొనియుండెను. ఆ లేవ మెచ్చుటకి లేచిపోయినను ఆమె కొకరు కుర్చీని వెనుక తీసికొని పోనక్కరలేదు. ఆమెగారు కూర్చొనియుండు కుర్చీ ఆమె పిక్క-పటపు బలుపునకు ఆమె విడవనొల్ల నట్లుండెను. ఇంత యెందులకు యామె కుర్చీ యను రాగబద్ధయో లేక కుర్చీయే యామెయందు బద్ధానురాగయో నేను జెప్పజాలను గాని బలిష్టులగు నలుగురు కుర్చీకాళ్లను బట్టి పండ్లు గింజుకొని క్రిందికి యీడ్చిన గాని వారిరువురును వేరు గాజాలరని మాత్రము జెప్పఁగలను. రావణుఁడు సరిగా హార్మోనియం రాణీవద్దకు వచ్చి ఊ! అవుటం యని హెచ్చరించఁగా నామె హార్మోనియము వాయించుట కారంభించెను. రావణుఁడును చేతులు జోడించుకొని "రామ నీ సమానమెవరు" యను పాటను పాడెను. అహాహా! మన ఆంధ్ర రావణునికిని, అరవ రావణునికిని గల భేదముఁ జూచితిరా! మన యాంధ్ర రావణునికి రామచంద్రుని మాటయన్న కాదే! యీతని వాసనే గిట్టదే. ఈ రావణుఁడు జూడుఁడు. యెంత భక్తి! రామమూర్తియందు యెంత అవ్యాజప్రేమ! రామస్మరణాఁ

తత్పరతయందు యెంత యామోదము. రావణుఁడా రాముని స్తుతించుట యెంత యసంభవము. అట్లు పాడిన రావణుఁడు సభవారివంకఁ దిరిగి అర్యరుగళ్లే యిప్పుడు. రామర్ వచ్చును నాకును యతనికిని జరుగు పోట్లాపోటిని గమనించ ప్రార్థన అనియెను. ఇంతలో రామచంద్రుఁడు లోనికి వచ్చి సభవారికి నమస్కరించెను. అట్లాతఁడు నమస్కరించిన వెంటనే ఒక పూర్వాచారి పరాయణుఁడగు నొక బ్రాహ్మణుఁడు లేచి టహో! ఇది యేమి!! అపరాధ మపరాధము!!! శ్రీరామ చంద్రుఁడెక్కడ! పాపసమన్వితులమగు మాకు నమస్కరించు టెక్కడ యని సాష్టాంగబడుటకుఁ జూచెనుగాని ముందు వెనుకలు కుర్చీలుండుటచేఁ నాతఁడట్లు చేయఁజాలకపోయెను. వచ్చినవాఁడు రామపాత్ర ధరించిన మానవుఁడని మరుచుట మనది తప్పో, రామపాత్ర ధరించి ఔచిత్య మెఱుఁగక నమస్కరించుట యాతనిది తప్పో మీరే యెఱుఁగవలయు. అయినది రసాభాసరంగము. కాదు కాదు. ఆనాటకరంగమున రామ రావణ పోటాపోటీ యారంభమగు సూచన లగుపడెను. పోటాపోటీ యనగ వా రిద్దఱు ఒకరినొక రక్కడ మెడ గఱచుకొని, చెయ్యి విఱుచుకొని, పండ్లు గఱచుకొని, కాళ్ళు పెనవేసికొని, యెచ్చట సాము చేయుదురో యనుకొంటిని కాని వెంటనే నా యభిప్రాయము మార్చుకొనవలసి వచ్చినది. యేలనన ఒక ప్రక్క పుణ్యమూర్తియు, లోకకల్యాణ మూర్తియు, సాక్షాత్ విష్ణ్వంశసంభూతుండగు శ్రీరామ

చంద్రమూర్తి వేషము ధరించినవాఁడు, మఱియొక ప్రక్క శివపూజా ధురంధరుండును, అనేక రాజ్యజయశీలుండును నగు రావణునంతటివాని వేషము వేసినవాఁడు, యంతటి యవివేకముగఁ బ్రవర్తింతురా! అట్లుండదని యనుకొనుచుండఁగానే నేను మొదట దలచినట్లు ద్వంద్వయుద్ధమునకు దిగక వాగ్వాదమునకు దిగబడిరి. మా ఆంధ్రసోదరుని పుణ్యమా యని నాకు ఒక్కవిషయముఁ గూడఁ దప్పకుండఁ జెప్పుచుండెను. రావణుఁడు మొదట శ్రీరాముని హేయమగు మాటలతో రాగధోరణిలో కబిత్తబారి లోని యెద్దువలె ముందువెనకలకు నడుచుచు తిట్టుచుండెను. రాముఁడును తన పుట్టినపుట్టుక పెరిగిన పెరగడము, లోకులకుఁ దనపైనున్న గౌరవముఁ దలవకనె కను లెఱ్ఱజేసి వలయాకారముగ సర్కసులోని గుఱ్ఱమువలెఁ దిరుగుచు రాగయుక్తముగఁ బదులుతిట్లు దిట్టుచుండెను. యేమయ్యా యీ ఖర్మ! కథ నొక యేటఁగలిపి యిట్లు బండబూతులు, చండప్రచండముగఁ దిట్టుకొనుచున్నారే యని నాకు విశదీకరించుచున్న యాతనిని యడిగితిని. అందులకాతఁడు పక్కున నవ్వి "వారవనితా జనితాపహారసుధారసంబుఁగ్రోలు మిషింజూమి" అని చెప్పి యింకను యిట్లు చెప్పఁదొడఁగెను. అయ్యా! వా రెట్టివేషము వేసిననేమి వారి గుణము మానెదరా! పై వేషము మారినంతమాత్రమున లోని వేషము మారగలదా! పైకి రామవేషము ధరించినంతమాత్రమున లోనున్న రంభాసంయోగ సంభ

మము చచ్చినదా! పైకి వీరుఁడగు రావణుని వేషము వేసి నంతమాత్రమున లోనున్న లొడలొడ తగ్గిపోయినదా! పైన రంగు మారినంతనే లోనున్న రంగు మారినదా! లేదే వారిరు వురికిని కథానాయకి యగు విమలవేణి విషయమున కొంచము మనస్పర్థయఁట! యది కారణముగ నీా విధముగ రాగ యుక్తముగ, సొంపుగ, దిట్టుకొనుచున్నారనియెను. మే మట్లు మాట్లాడుచుండగనే యేమికారణమోగాని తెరను దింపివేసిరి. తెర వేసినది రామ రావణులు చూడలేముకాఁబోలు వారిం కను తిట్టుకొనుచుండుట మాకు వినబడుచునే యుండెను. అం దరును గొల్లున నవ్విరి. మరల కొంచెముసేపటికి తెర దెరువఁ బడెను. హార్మోనియం రాణి యగు కోమలాంబాల్ గారు హార్మోనియం వాయించుచు గారెలపై ఒక పాట చెప్పి గారెలపై తనకున్న మోహాతిశయమును వెడలఁ గ్రక్కెను. తరువాత విమలవేణిగారు సర్వాభరణాలంకృతయై జిలజిల మెఱయు సరిగ చీరను ధరించి, కంటి కద్దములు బెట్టుకొని బహు ఒయ్యారముగ నడుగులు బెట్టుచు లోనికి వచ్చి సభ వారికి వందన మర్పించెను. సరె! రామునకుఁబట్టిన రోగమే సీతకుఁ గూడ గలిగినదని యనుకొని, నా స్నేహితుని జూచి అయ్యా! ఆ కంటికి సులోచనము లేమిటి, నారచీరలు ధరింప వలసిన సీత సులోచనములు, సిల్కుగుడ్డల శృంగారములు తగులఁ బెట్టుకొనివచ్చినదే, అదేమి ఆమె చెవులు గనుబడ నీయక యా వెంట్రుకలు ముందునకు దిగజార విడిచి జడ

వేసికొనినదే యని యంటిని. అందుల కాతఁడు సులోచన ములు వేయుట తనకున్న గాజుకన్ను కనబడనీయక మరుగు బెట్టుకొనుటకు, సిల్కు గుడ్డలు తనకున్న కృష్ణవర్ణముఁ గప్పి పుచ్చుటకొఱకు, వెండ్రుకలు జారవేసికొని యుండుటలో నొక కథ గలదు. ఇంతకుముందు వచ్చిన రామ రావణ వేష ధారులలోనొకఁడు ఆమెచే నిరసింపఁబడుటచే కోపమున నొక చెవిని కోసివేసెనఁట. అప్పటినుండియు ఒక చెవిని జూపు టెట్లుయని వెంట్రుకలు జారవిడచి యున్నది. ఇదియే పార్సి బ్యూటీ లక్షణము లని యాతఁడు చెప్పెను. అంతట రావణుఁడు కూడ యచ్చట ప్రత్యక్షమయి హార్మోనియం రాణీని జూచుచు సీత వేషధారిణిని వ్రేలితోఁజూపుచు "ఇక నేమందునే చెలియా! నా రాణికి నామీఁద యేమో అలు కాయా! అని యొకమారును," మోడీ జేసెవేలనే నా సీటు సాని, అని మఱియొక సారియును పాడెను. ఈ పాట వినినదే నాకు కొంచెము దూరమున గూర్చునియుండిన యొక పూర్వ సువాసిని ప్రక్కనయున్న యామెనుజూచి యీతఁడెంత రసగ్ర హణపారీణ చక్రవర్తియమ్మా! మన కింతటి యదృష్టము బట్టుట కింక యెన్నిజన్మములకో యని తన పూర్వప్రియుని దలుచుకొని కాబోలు కన్నుల నిండ నీరు దెచ్చుకొనియెను. ఇంతలోపల సీతాదేవి "బిగువుజేసేవేలరా। నా సామి నాతో పగమీఱర మారుఁడు బాధింపసాగెన। పావనాధరంబిచ్చి పరితాప మాపమంటే॥ బి॥ అని పాడుచు నవ్వుచు, నాట్యమా

మున కధికారి యగు నీ రహస్యము కాదు—కాదు—ఇట్టి వెన్నో విశాలాతి విశాలప్రపంచములకు ప్రభువగు నీరహస్యము మాబోంటి వెఱ్ఱివెంగళప్పలు ఈ యెముకల చిప్పలోని కొసంత మెదడుతో తెలుసుకొనగోరుటకు సాధ్యమగునా యని చిరు నగవు నగుచున్నారా! అయినను మానవజీవితమున కూంత కోలగ—సహాయకారిగ—ఆధారయుక్తముగ—అనుసరణీయ ముగ—నుండుటకొఱకై నీరహస్యములోని కొంత భాగమైనను దెలిసికొన బనిలేదా, ఓహో ప్రకృతి యొసంగు గురూప దేశమే—నీతి బాహుళ్యముగ — సదుపదేశముగ—సక్రమ పద్ధతిగ — బోధనాపూర్వకముగ — విజ్ఞానయుక్తముగ— బోధించుచున్నప్పుడు, మీకన్నులయెదుట నాట్యమాడి తెలియఁజెప్పుచున్నప్పుడు—అడుగడుగునకు మీలో మీరు తర్కించుకొనునటులఁ జేయుచున్నప్పుడు—నా సృష్టిలోని ప్రతి పదార్థము మీ కొక్కొక్క నీతిని బోధించుచున్నప్పుడు— ఇక ప్రత్యేకముగ మీరు తెలిసికొనదగిన దేది—నేను తెలియఁ జెప్పున దేది యని యనుచున్నారా—రామచంద్రా! యేమే విత్తు నెచ్చ టెచ్చట నాటవలయునో నచ్చటచ్చట నాటింపక నీ యిష్టము చొప్పున వెదజల్లుచుంటివే, అందులోని పర మార్థము బోధపడుటలేదే, యెంద ఱెందరో ననుభవజ్ఞులు జేరి చేతుల జోడించుకొని—శిరమును క్రిందికి వ్రేలవైచుకొని— శరీర మట్టె కుందించుకొని—నెత్తిపై మొట్టికలు వేసికొని— లెంపలు గొట్టుకొని యీ రహస్యమును దెలుప బ్రార్థించితిని

గాని, యేదీ! జెప్పినవా రేరీ, కొందఱు మూతి ముడచికొనిరి, కొందరు నిరాశాహాస మొక్కటి దయచేసిరి, మఱికొందరు మమ్ములను దర్శించుటకు వచ్చితివా, నీ కింత పొగరా, యని గద్దించిరి. ఇంకను కొందరు హుమ్మని హుంకరించిరి. ఇన్ని అయినను నా మన స్సూరకుండుటలేదు. సదా నీ మాయా తత్వ రహస్యము కొంతవఱకైన బోధపడువఱకు తహతహ లాడుచున్నది. దేవా! ఈ చిత్ర మేమి! నల్లని మొగమునకు నిమ్మపండువంటి నాతిని, కాకినలుపు కోమలికి పసిడికాంతి పెనిమిటి నంటుగట్టుటా, కాకిముక్కునకు దొండపండా! పొడవు పురుషునికి పొట్టిపొలతియా! లొట్టిపిట్టలలనకు పొట్టిమగడా! తాటిచెట్టునకు తొలసిమొక్కకు కల్యాణమా! యెమ్ముల యేబరాసికి బొట్టువంటి బోటియా! శాంతస్వరూపునికి కోప ద్విగుణీకృత యగు గయ్యాళిగంపయా! హే! హే!! హే!!! త్యాగ మూర్తికి లోభియగు లేమయా! పిసినిపొలతుకకు ధర్మమూర్తి యా! పతివ్రతకు పాషండుఁడా! ఏకసతీవ్రతునకు గడించు పడ తియా! భీరునకు వీరవనితయా! కురూపికి సురూపియా! మొగలి పువ్వునకు ముండ్లవరుసలా! ముక్కంటి తల పూవునకు (చంద్రునకు) మధ్యను మచ్చయా! పిఱికిమొకమునకు మువ్వన్నె మొకముచే మృత్యువా! ఇట్లెందులకు జేసితివి. ఓ ఇంకను యెన్ని జెప్పగలను! నేను జెప్పుచున్న దంతయు మీరు వినుటకు నా జీవితమే చాలదే! అట్టె యిచ్చోట తాము వినుచుండిన ఇక ప్రపంచపుగతి యేమి! వారి బాధల

బాగోగులు, దుఃఖములుగ మన్నించువా రెవరు! చాలు చాలు! నిలుపవయ్యా నిలుపు అంతటితో నిలుపు ఆది యంతము లేక వదరుచున్నావే! నా సమాధానమే నీకు బనిలేదాయని సెలవిచ్చుచుంటిరా! అడియేను ఇదిగో లెంపలు వేసికొనిచుంటిని చెప్పడు. యింతవఱకు జెప్పడు. ఇదిగో! ఇదిగో!! రామచంద్రా! హేపుణ్యమూర్తీ! నా వాగుడునకు బీగము దగిలించుకొనుచుంటిని. ప్రకృతి.......యనియేమో యనబోయి అట్టె—యట్టె—నిలిపితిరే! దేవా! నేను మూర్ఖుఁడను. వదురుబోతును. ఇంగితిజ్ఞాన మఱియును, డాంబికుఁడను, వ్యర్థుఁడను, నీచాతి నీచులకన్న పరమనీచుడను, పాపిని, మదాంధుఁడను. ఓ కల్యాణమూర్తీ యవధరింపుము. శాంత మూర్తీ ముఖమేమి అటుల ద్రిప్పుకొంటిరి. ఇంకను నా యధిక ప్రసంగమును నిలుపలేదనియేనా! ఇదిగో సెలవిండు. నోటికి తాళము వేసితిని. పొంగి పొరల నుంకించు హృదయవేగము నకు యనకట్ట గట్టివేసితిని. పుంఖాను పుంఖములుగ వెల్లి విరియు మనోభావములకు స్వస్తిజెప్పితిని. ఓ బిడ్డా వినుము, ఎందుల కిట్లు వాపోయెదవు. ప్రకృతి నీకు గురువు గాదా! ప్రకృతి నీ పాలిటి కొక మహాప్రవక్త గాదా! పట్టెడన్నము బెట్టిన శునకము నీవు జచ్చునంతవఱకు అయ్యది జీవించునంత వఱకు తన తోక నాడించుచు తన విశ్వాసముచు జూపించు చుండుట లేదా! మృగమే యంతటి నిర్మలానుపమేయమగు విశ్వాసముఁగలిగి, నిన్ను గూడ నట్టులే యుండవలయు నని

పలుమారు జ్ఞాపక పరచుచున్నప్పుడు నీ వెట్లుండవలెను. మానవుఁడని, సృష్టిలో ప్రధానుఁడవనియనుట పేరునకేగాని, నీకా కుక్కకున్న విశ్వాసములో సహస్రాంశమైన లేదే! అట్టి జ్ఞానతత్వము, పరలోకసాధనము. ఇహలోక విముక్తిని బోధించుచున్న యా ప్రాణిని నీ వేమి గౌరవించుచున్నావు. రెండు వెంగలిమెతుకులు, చెప్పుదెబ్బలు, కాలితన్నులు గాక దాని కిక నీ విచ్చునదేమి? ఇన్ని నీ వలన బొందినను తన విశ్వాస మదినీకు బోధించుటకు మానినదా! నీ వెప్పుడైన ఆ మృగము నీ కట్టి తత్వమును బోధించుచుండెనని తలచు చున్నావా, లేదే! ప్రతి మృగము, ప్రతి వృక్షము, ప్రతి పిపీలికము, సంసారసాగరమున బడి మునుగుచు దేలుచు సన్మార్గప్రవర్తమున కెడమియ్యని నీకు—బ్రతుకుటకే చేత గాని నీకు—జీవించుటకే దెలియని నీకు—ప్రాణములు పోషించుకొనుటకే తికమకలాడు చచ్చుపెద్దమ్మవగు నీకు—ఆధారభూతముగ—ఇహ పర సాధనములుగ—నున్నవనుట దెలిసికొంటివా—దెలిసికొనకున్న ఇకనైన దెలిసికొనుము గార్ధభమువలన ఓర్పు, సింహమువలన గంభీరము, గోవువలన పరోపకారత్వము, చెవులపోతు వలని నాజూకు. ఇంక ఒక్కొక్క మృగమువలని ఒక్కొక్క విషయము నీకు బోధించుట కొఱకై సృష్టింపఁబడినవి యని సెలవొసంగు చున్నారా? కానిండు! కానిండు!! ఇదో తమ చరణద్వయముల ముద్దిడు కొనుచున్నాను. నా యనుమానముల దీర్పుఁడు—"నాయనా!

వినుము. మధ్యమధ్య వాగుచుండకుము. నీకు ప్రతివస్తువు బోధించు తత్వము గ్రహించుకొనగలుగు బుద్ధియొసంగియే యున్నాను గాని—మూర్ఖుఁడగు నీవు—యజ్ఞానుఁడ వగు నీవు—కామోద్రేకములచే క్రై పెక్కిన నీవు—తిండి, తిండి యని సదా కూనురాగము దీయు నీవు—కడుపు చేతబట్టు కొని సాపాటుకొఱకు దిరుగు నీవు—పాపపంకిలమున బొర్లాడ నఁబులాటము బడు నీవు—ఒకపరి మృత్యువు నిన్నట్టె దిగ మ్రింగునను జ్ఞాపకమే లేని నీవు—అట్టి నీతిని గ్రహించుట విడిచిపెట్టి— విమర్శించుటే వదలిపెట్టి—సత్యాన్వేషఁణుడ వగుట కేవగించి—ఒక్కొక్క వస్తువులోని నీచత్వమునే గ్రహించుటకొఱకు—ఒక్కరిని మోసముజేయుట కొఱకు— మఱి యొక్కరిని పీడించుట కొఱకు—కొందరిని త్రైతక్క లాడించుటకొఱకు—మఱికొందరిని పాతాళమున కేసి యణ గఁద్రొక్కుటకొఱకు—కడుపులోని రెండు మెతుకులకొఱకు— నీ కిచ్చియుండెడి యీ స్వల్పబుద్ధిని వినియోగించుచున్నావు— నీ బుద్ధికిఁ దగిన గంతులు వేయుచున్నావు—నీ పుట్టుకకుఁ దగిన పట్టీలు వేయుచున్నావు—అట్లుగాక నీకున్న ఆ కాసంత బుద్ధితో ప్రకృతి సహాయ్యమున నీ కెట్టి నీతుల బోధించు చుంటినో తెలిసికొని యా ప్రకారము నీవు నడచుకొనుచుండిన ఇక నీకు గావలసిన దేది—ఓహో—అప్పుడు నేనే నీవు— నీవే నేను—నీ పిలుపునకు నేను హాజరు—నీలో తాండవ మాడుదును—నీతో నాట్యమాడుదును—నీతో భాషింతును—

నిన్ను ముద్దాడుదును—చాలునా ఇంతకంటె నీకికఁ గావలసిన దేద్ది—ప్రకృతి బోధించునదింకను వినుము. వృక్షములు సహితము నీకు హితవగు బోధఁజేయుచున్నవని యనుచుంటిరా? ఏమేమి! వృక్షములుకూడ బోధనాగురువులేనా! ఎట్లో కొంత జెప్పెదను. బిడ్డా! వినుము. టెంకాయచెట్టు నీవు బోయు అశుద్ధోదకమును గ్రహించి, తియ్యని పానీయము, పదార్థ మొసఁగుచున్నది. తాటికి నీవు నీరు బోయకున్నను సరే చల్లనగు పదార్థ మొసఁగుచున్నది. అట్లె యడవిలోని పెక్కు ఫలవృక్షములు నీ సహాయ మపేక్షింపకయే, నీ వలన యావగింజంతయు కూడ మేలుబొందకయే మధురఫలములనేమి—సౌరభముల వెదజల్లు తమ సుకుమార సౌందర్యయుతమగు పుష్పములనేమి—నిన్ను బిలిచిబిలిచి తండ్రీ! ఇదిగో నీ కొఱకు—మా కన్న సృష్టిలో గొప్పయని పేరొందిన నీ సంతోషము కొఱకు—కష్టించి పెంపొందజేసిన యీ ఫలముల యారగించి, యీ పుష్పముల యాఘ్రాణించి ధరించి పొమ్ము నాయనా! అప్పటికి గాని మా చరితములు కృతార్థములు కాజాలవని జెప్పుచున్నట్లు నీకుఁ దోచుటే లేదా! మఱి కొన్ని వృక్షములు తమ దీర్ఘములగు శాఖల విశాలముగ జాపి, రమ్ము! నాయనా రమ్ము!! నా యీ చల్లని నీడను ఎండ తాపమున తీర్చుకొని మఱి పోవుదువుగాని యని శాఖలవంటి చేతులతో నిన్నాహ్వానించుట నీవు చూచుటలేదా! వాని శరీరములనే నీవు కొంపగట్టుకొనుటకు నొసఁగుచుండుటలేదా!

నీవు కన్నకసమూలములఁ దిని—చేయరానిపనులఁ జేసి—నియమములకు విరుద్ధముగ నటించి—రోగములకుప్పచే నోరు దెఱచుకొని మూల్గుచున్న నీకు భూగర్భమున దాగియున్న యౌషధుల వేరులమూలమున తమ లోనికి స్వీకరించి యా యాకులఁ ద్రుంచివై చెద వను భయము గూడ లేక తమ పట్టను ఊడదీయుదువను జంకైన లేక—వేర్లతో గూడ పెకలించి వైతువను బిడియమైన లేక నీ ప్రాణముల కొఱకు వాని ప్రాణములే దారపోయుట నీకు పరోపకార పారీణత బోధించుట గాదా! అతిథిసత్కారమును గూర్చి నీ శిగద్రొక్కినట్లు నటించుటగాదా! నీకు లజ్జవచ్చునట్లు, త్యాగమును గూర్చి బోధించుట గాదా''! యని దెలిపితిరా! ఓ సర్వవ్యాపీ గ్రహించితిని. ఆహా! మీ పలుకు లెంత మాధుర్యము! ఏమి యానందము, జగద్రక్షకా నా మాటలతో మీ కాలమును వ్యర్థపుచ్చజాలను. ఇంకను కానిండు విందును. విని యానందించెదను. యానందించి మననము జేసికొందును. మననము జేసికొని అట్లే వర్తింతును. అట్లే వర్తించి మీకు మంచివాఁడనని యనిపించుకొందును. “అనిపించుకొందువా మంచిది. ఇక నో రొకింత బిగించుకొని వినుము. పిపీలికాది పక్షిగణములు గూడ హితము సల్పుచున్నవి. నేల నడచు చీమ, పుష్పములలో మధువు గ్రహించు తేనెగల జీవితములే సోమరులకు మూతి పెట్టుకాదా! కేవల మొక్క కసువునే మెసవుచున్న మృగముల జీవనము సమస్తహేయపదార్థముల

భుజించు తిండిపోతులకు తారకమంత్రము కాదా! పెట్టకున్నను బోయకున్నను తన శ్రావ్యగీతముచే నానందింపఁజేయు కోయిల జీవితమున పరుల సంతోషపెట్టుటే తన విధి యని దెలియుటలేదా! సూర్యచంద్రాదులు కాలము దప్పక తమకు నియమించిన పనిని జేయుచుండ మానవులు తమ పనులవట్లింకెట్లు వర్తింపవలయునో యూహింపఁ బనిలేదా! ఇట్లే ప్రకృతి మానవునికి గావలసిన యన్నివిధములగు తత్త్వములు బోధించుచున్నది. అవి యన్నియు నిప్పుడు జెప్పుటకు వీలుండదు. ఇక నీ యనుమాన మేమి? భార్యాభర్తలవిషయమా, ఎందుల కట్లు అంటగట్టితివనియేనా! నా కంత పిచ్చి యనుకొంటివా! కురూపిని కురూపి కంటగట్టిన వారికి పుట్టబోవు సంతాన మెట్లుండునో యూహించితివా! నీ వప్పు డట్టి వారి ముఖము జూచియు, ఈ ప్రపంచమున వారిమధ్య జీవింప నిచ్ఛగింతువా! వారు జూచుట కెట్లుందురు. తాటకి తాతవలె, కబంధుని కోడలివలె, శూర్పణఖ మేనత్తకొడుకువలె దేశ మంతయు నిండిపోరా! అట్లుగాక కురూప సురూపులను జేర్చినవారికి బుట్టువారు మధ్యరకములో జేరినవారుగ నైన నుందురుగదా!

ఏమీ! ఏమంటివి. అట్లయిన కురూపులను ఏల బుట్టించితివనియా! నేను బుట్టించితినా, మీరే జేసికొంటిరా! మొట్టమొదట సురూపులుగ నున్నవారే వారి యవ్యక్తతచే అవకతవకపు చేష్టలచే, కాలాదినిర్ణయముల పాటింపని కూడి

కలషలితోముగ యిట్లప్పావ్రకులు—మొండి వ్రేళ్ళవారు—కాళ్లు పొడుగువారు — పొట్టికడుపువారు — మిట్టపండ్లవారు— దొప్పచెవులవారు—ఎముకలకూటివారు—గూబకన్నులవారు— కుబ్జదేహమువారు—పేడిమూతివారు—లావుబుఱ్ఱలవారు— వారు వీరననేల అన్నిరకములవారు గల్గుచున్నారు గాని, నేను కారకుఁడను గానని ఇప్పటికైనను దెలిసికొంటివా! ఒక్క అవయవములేని వ్యక్తిని, మఱియొక అవయవముగల వ్యక్తితో జేర్చిన, బుద్ధిలోపము గలవారితో, బుద్ధిగలిగిన వారిని జేర్చిన, వారికి లోపమున్న లోటు బోయి కలిగిన వారివలన సాహాయ్యము బొందుచుందురుగదా! సిడిముడి రాయుని యలుక గల ఆలుతో జేర్చిన ఆకుటుంబము నిక వేరుగ మంటలు గావలయునా! తగవులకు తరుగేది, ఇక నచ్చట సంతోష మెక్కడిది. శాంతమూర్తిని గయ్యాళి కంటగట్టితి నంటివిగదా! ఒకరిలోని తత్వము దెలిసికొనుటకు నీముఖము నీకేమి తెలియును. ఆరక్కసి భార్యవలననే అతఁడు తాల్మి బంటాయెను. భక్తుఁడాయెను. కాని అట్టె యాతని గుణము కొంచము త్రప్పదోవ ద్రొక్కెడి వేళకే, తీ, దెబ్బ— తీ, భార్య బొబ్బరింపులకు, యామె ఘీంకారమునకు—యామె బెట్టెడి కన్నీటికి—తప్ప తడసిన గువ్వాయయిపోవుచున్నాఁడు— తనలో పెంపొందు దుర్గుణమునకు స్వస్తి జెప్పుకొనుచున్నాఁడు —అడియే నని నిన్ను ప్రార్థించుచున్నాఁడు—కన్నులలో నీరు దెచ్చుకొనుచున్నాఁడు—నెమరు వేయుచున్నాడు. అట్లు

గాదేని ఆశించుట విచ్చలవిడిగా, దిరిగి పోగరుబోతులలో జేరి యుండకపోవునని కొంటివా! అట్లే వారి, వారి గుణముల కొంతసలకైన సరిదిద్దుకొనుటకును, దుర్మార్గపు గుంపెక్కువ గాకుండుటకొఱకును అట్లు జేర్చవలసి వచ్చెను గాని లేకున్న నాకీ తొందరెందులకు? నిర్మలచిత్తముగలిగి తమ స్వాభావికమును మెన్నియేని శోధనలకైన లోజేయరను నమ్మకము నాకు గలిగినవారిని సుస్వరూపుల అందమైన వారలతోను మంచివారిని సుగుణభూషణులతోను నొక్కటిగఁ జేర్చియుండ లేదా! వారు సంతోషస్వాంతులై సంసారభారమును నీవను కొనినట్లు దుఃఖభాజనములోనికి ద్రింపక జరుపుకొనుచుండుట లేదా! అందుకనియే ఆయావిత్తు పరిశుభ్రపడుట కే—మంచి నేర్చుకొనుటకొఱకే యవనీతిలో కాలువేయకుండుటకొఱకే—తమ నైజవర్ణమును పైకెరిగింపక మార్చుకొనుటకొఱకే—ఆయాచోటుల జల్లుచుంటిని గాని నీవనుకొనినట్లు నీసృష్టికి గోచరమయినట్లు, నీవు వెఱ్ఱి వెట్టిగ దలపోసినట్లు కానిచోటులందు ప్రకాశింపని స్థలములందు, బ్రతుకలేని ప్రదేశములందు బడవేయుటకు నాకేమి వారిపై పగయా! వారు మాత్రము నాబిడ్డలుగారా! వారి శ్రేయమే నాయానందముగాదా! వారి సంతోషమే నా సంతోషముకాదా! ఏమి! లోలోననె వదురు కొనుచున్నావు. లోని లొడలొడకు పైకంత మూకీభావ మెందులకు—దెలిసినదిలే! నాకేమియు నీవు జెప్పవలసిన బని లేదు. అట్లయిన ఇంతటి గయ్యాళిగంపలను—యవినీతివరు

లను—సొట్టకొయ్యలను—మృగతుల్యులను— విశ్వాసరాహిత్యులను—ప్రగల్భమతులను—మోసగాండ్రను— తిండిపోతులను—దైవదూరులను — యేల సృజించితినని యేగదా నీ తలంపు—అద్దిమాట — నీహృదయములోఁగల యనుమానమడిగి దీర్చుకొనుము. ఏమినీవెఱ్ఱి—నీవు వయస్సున వృద్ధుఁడగుచుండినను బుద్ధియందు వృద్ధుఁడగుటలేదే—ఔనులే. కడుపుకూటికొఱకు—వస్త్రధారణ కొఱకు—ధన ధాన్యముల కొఱకు—సుఖముకొఱకు—యేవేళయందు దేవులాడుచుండు నీబుద్ధి యంతవఱ కెట్లు వ్యాపించును. పుట్టినప్పుడు ప్రతిప్రాణియు యెంత యమాయికత్వముగ—యెంత నిర్మలచిత్తముగ—ఎంత పాపరహితముగ—బుట్టుచున్నదో గ్రహించితివా! నేనెట్లు నిరంతరము ఆచిరుతునిలోఁ తాండవమాడుచుంటినో యాచిట్టిమోమును—ఒక్కింత పాపము చేతనైన మాయని యామోమును—ముద్దులవర్షమును గురియించుచున్న యామోమును—జూచియైన గనుఁగొనజాలకపోతివా—అట్టి యాబిడ్డ రాను రాను నన్ను (యనగా తనలోనున్న మంచిని) దరిమివైచి తన స్వశక్తి యనెడి నీచవృత్తిని తన్నుఁ తావలచి దెచ్చుకొనుచుండగా నేనేమిచేయఁగలను. ఇప్పటికైన తప్పెవరిదో గ్రహించితివా? కానిమ్ము ఇంకొకపరి యీ ప్రకృతి విషయమునుగూర్చి విపులముగఁ జెప్పెదను గాని యింకను నేమైన యనుమానములున్న ప్రశ్నింపుమని అనుచున్నారా!

నా స్వామికి నాపై నెంత ప్రేమ. నా ప్రభువుకు నాపై యెంతకరుణ నా మురిపెముల తండ్రీ! నా ముద్దుల నాయనా!

నీ వెంత దయాశీలుఁడవు! నే నడుగు ప్రశ్నలకు సమాధాన మిచ్చెదవా! నీవే ప్రేమయందురు. ప్రేమే నీవందురు. ఆయ్యది యూరక బోవునా! ఓహో! నాహృదయాధిపా, నీవెంత సౌందర్యవంతుడవు. ప్రేమకుదగిన ప్రోఢిమ, అందమునకుదగిన అమరిక, శాంతమునకు దగిన సోయగము, పరితాపమునకు దగిన టుల పొంకము ఆహా! నాహృదయానందము వెలిబుచ్చుటకు నాకు మాటలు చాలవే! మీరు నా మ్రోలనున్నంతవరకు నా దేహ మెటుల పులకాంకితమగుచున్నదో దెలియపరచుటకు నాలో పుట్టు భావములు జాలుట లేదే, నన్నట్లు నీకొసవ్రేళ్లతో తాకుము తండ్రీ, వలదులే—వలదు—మీకంతశ్రమ యెందులకొసగవలయు—నన్ను విడిచి పోవకుము, నన్ను దిక్కులేనివానిగ జేయకుము, నన్ను నీవెంట గొనిపొమ్ము, యేమి, తండ్రీ, నా యీ కీకరకారభాషతో నీకు విసుగు కలిగించుచున్నానా నాయప్పవుకదూ, నన్ను మన్నింపవు, ఇదిగో నీ పాదముల ముద్దిడుకొనియెద అహాహా! ఏమి యీ పాదముల సౌరభవము యే పుష్పమునకు గలదు, ఈ మృదుత్వము యే పదార్థమునకుఁగలదు నాతండ్రీ! నా నాయనా!—త్వరగా నీ వడుగవలసిన దేమో యడుగుము. ఎందులకీ కాలక్షేప మని మందలించుచుంటిరా! నాలో గల ప్రేమ, భక్తి, యిట్లు వదరిననే గాని మీకుఁదెలియదా! ఉగ్గుపాలతోఁ బుట్టిన యీ లొడ లొడ యెంత బుద్ధి చెప్పినను ఒక్కపెట్టున నిలుచునా! ఓ సౌమ్యమూర్తీ!

యడుగుచుంటిని వినుడు. యనాథల నెందులకుఁ బుట్టించితివి, తండ్రీ! ఇన్ని జగములేలు పరమ పావనమూర్తికి కూటికిలేని వాని కడుపు బూడ్చుటకు చేతఁగాకబోయెనా! ఒకనాడు ఆదృశ్యమును కన్నులార జూచితిని—అబ్బా—రామా—నే నెటుల నీకా దృశ్యమును గూర్చి విశదపఱతును. నీ మృదుహృదయ మెంతొ తపించునోకదా! అయినను నే నేమిచేయుదును. నా యనుమానముఁ దీర్చుకొనుట కొఱకు జెప్పితీరుదును. ఒక్కదినము—ప్రభూ అక్కరగ వినుచుంటిరా—నేను దేశద్రిమ్మరివలె—పనిలేని మంగలి వలె—శుష్కవేదాంతివలె—పనియున్న దాసివలె అచ్చ టచ్చటికి పరుగులిడు కుక్కవలె—యెచ్చటికో బోవుచుంటిని ఒకచోట ఒక స్త్రీ—బక్కచిక్కి నడలియున్న యొకస్త్రీ— త్రాళ్లవలె పేలికలు ధరించి యున్న యొక స్త్రీ—దిక్కులేని యొక స్త్రీ—సంపూర్ణ దారిద్ర్యదేవతా యాలింగనసౌఖ్య మనుభవించుచున్న నొక స్త్రీ—కడు పున్నదో లేదో యను సందేహమును దోఁపఁజేయు నొక స్త్రీ—జీవముతో కదులు చున్న యెముకల పంజరముగల నొక స్త్రీ—హే ప్రభూ! ఆ రూపముఁ జూచినప్పుడు నాకే కన్నీరు వచ్చినప్పుడు నీ కెట్లుండి యుండునో నేను జెప్పఁగలనా! అట్టి తల్లి ఒక చెట్టునీడను గూర్చుండి, తన కన్నుల యాకాశమువంక ద్రిప్పి రెండుచేతులజోడించి ప్రతిమవలె నుండుటఁ జూచితిని. ఓ దేవా! యా పేదరాలి విగ్రహమును మీా పవిత్రహృదయ

కమలమున సరిగనే చిత్రించితినా యాస్త్రీమూర్తి నాకేమియుఁ జెప్పలేదు. కాని రామా—యామె భావములలో—యామె చూపులలో—యామె నిట్టూర్పులలో—యామె శుష్క హాసములలో—నాకు గోచరించిన దేదో జెప్పుచుంటిని. యామె నిన్ను నిశ్చలముగఁ బ్రార్థించుచుండెను. ఓ దేవా! ఈయపవిత్రురాలిని గనికరించ కిటుల బాధలలో ముంచుటకు నీ కేమి యపరాధము గావించితిని నీ యనంతసృష్టిలో యీ ఒక ప్రాణియే నీకు భారముగఁ దోచెనా! చీమలకు సహిత మాహార మొసఁగు మానవీయునకు నాకు పట్టెడన్నము, మూరెడు వేలికే దయచేయించుటకు గష్టమాయెనా! కరుణామూర్తియగు నీవే—దయాస్వరూపుఁడగు నీవే—పుణ్యమూర్తి యగు నీవే—జనులపాలిటి ధనసంచయమగు నీవే—యనాథల కమృతమగు నీవే—నన్ను పరామర్శించకున్న, విచారింపకున్న, సహాయము జేయకున్న, రక్షింపకున్న, దిక్కులేని దానిగఁ జేసియున్న—చేయూఁత యీయకున్న ఇక నాకు దిక్కేది. నాయనా! నేనిక యెంతో కాలము జీవించి యుండజాలను—యీ బాధలు పడజాలను, మనజాలను, ఓ ప్రభూ! దయామయా—యింకను యెందులకు, ఇచ్చటనే—ఈ సమయముననే నానాటక తెరనుదింపి వేయుము యని పలు పలువిధముల విలపించుచున్నట్లు యామె భావములు దెలుపుచుండెను. రామా! యట్టి ప్రాణము నీ కేమి యుపకార మొనర్చినది. హంసతూలికాతల్పముల శయనించి, క్షుధాతురుల

శ్రమలఁ దీర్చక—పేదల మొరల నాలకింపక—హాయిహాయి యనుచు తమ సుఖమునే జూచుకొనుచున్న శ్రీమంతుల కింకను ధన మొసంగుచుంటివే వారేమి నీకు చుట్టములా! ఓ లోక బాంధవా! ఈ శ్లోకమున కర్థమేమి! శ్లో॥ ఈశస్య కంఠలగ్నోపి వాసుకిర్వాయు భోజనః। మహతాంస్థాన మాశ్రిత్య। ఫలం భాగ్యానుసారిః॥ ఓ పుణ్యమూర్తీ అది యట్లుండనిమ్ము. నీ వెచ్చటనుంటివి! నీ కాపుర మెచ్చట! నీ వన్నిచోటులయం దుందువనుచున్నారే గాని, నిన్ను జూచినవారేరి! తండ్రీ నిన్ను జూచుటకై—నీతో ఒక్కమాట బలుకుటకొఱకై— నీ వెంతటి రూపవంతుఁడవో కనుగొనుటగొఱకై—యెందఱెందరు తమ జీవితమును ధారపోసిరి—తలలు క్రిందుగ తపసు జేసిరి—యెన్ని యుపవాసవ్రతములు సల్పిరి—గాని రక్షకా! నిన్ను క్రీగంటనైన జూచినవారేరి! నీ విట్లున్నావని జెప్పిన వారేరి—నీ పలుకుల మాధుర్య మిట్టిదని దెల్పినవారేరి— తండ్రీ నీ విట్లగమ్యగోచరుఁడవై యుండుటేల! నూటి కొక్కరికైన—కాదు వేయి కొక్కరికైన అదియును కాదు— లక్ష కొక్కరికైన—పోనీ కోటి కొక్క రికైన—తుదకు లోక మున కొక్కరికైన నీ దర్శనభాగ్యముఁ గలుగఁజేయక పోతివే అదేమి అట్లు నగుచున్నారు! నా మాటలలో సార మేమియు లేదనియేనా—కానిండు—ఓ దీనావనా! ఇంకను నెన్నియో గలవు. జెప్పుమనిన జెప్పెదను గాని మిమ్ము లెందరెందఱు బిలుచుచున్నారో యెన్ని తొందర పను లున్నవో, కదా!

నాయనా ! వినుము అనుచున్నారా ! ఇదిగో వినుచుంటిని. ఇక నేను నోరు దెరువను. ఇంతవఱకు దగిన ప్రశ్నలకు సమాధానమిండు. మిగిలినవి మఱియొకప్పుడు......వినుమయ్యా వినుము. ఊరక లేనిపోనిమాటలచే కాల మెందులకు వ్యర్థ బుచ్చెదవు. ఏమి నీ మొదటిప్రశ్న బీదల నెందులకు బుట్టించితినని యేకదా, నాయనా ! బీదగర్భమనియు లక్ష్మీకటాక్షవీక్షణముఁగల కడుపనియు నేను నిర్దిష్టించలేను. బిడ్డలుపుట్టినప్పుడు యీ బిడ్డఁడు భాగ్యవంతుఁడు కావలయునని వీనిని కనకాంబరములతోను— సరిగెవస్త్రములతోను — బంగారు కాసులతోను బుట్టించుచున్నానా ! ఆ బిడ్డడు బీద గావలయునని వానినిచింపిరిపేలిక—చీరపోతు—చీపురుకట్లతో బుట్టించుచున్నానా—లేదే. వాఁడేమి నాకు హెచ్చు వీఁడేమి నాకు తగ్గు—వాఁ డేమిగొప్ప — వీఁ డే మి కొం చెము—వాఁడేమి మిక్కుటము—వీఁడేమి మట్టము—వాఁడేమి లావు—వీఁడేమి తక్కువ. కాని, వినుచున్నావా పుట్టినప్పు డందరిని నొక్కటిగనె బుట్టించు చుంటిని. బీదలనుండి భాగ్యవంతులయినవారు — కుబేరునంతటి వానిగా నుండి కూటికేలేక వచ్చినవారు—పట్టుపరుపులపై బరుండి పలకరాళ్ళపైఁ బరుండినవారు—పేడతట్టలు మోయుచుండి పైడికాసులు మూటగట్టినవారు—ఎందఱులేరు—ఒకరి భాగ్యమునకు ఒకరి బీదత్వమునకు నేను కారకుఁడనా ! వారివారి బుద్ధిచాతుర్యమును బట్టి ఒకఁడు పాతాళములోనికి దిగిపోవుచు

న్నాఁడు. మఱియొకఁడు పైకి ప్రాకిపోవుచున్నాఁడు. అదేమి తల క్రిందికి వంచుకొనుచుంటివి. నేను చెప్పిన విషయము నీకు నచ్చుటలేదా! విను—విను—పూర్తిగ వినకనే యంత తొందరేల! లోనిదంతయు పైకి రాకమునుపే యంత తొందర రెందులకు! నీ నైజగుణము విడిచిపెట్టి వినుము. పై జెప్పిన విషయము ప్రకృతి సహజముగ జరుగునవి. అట్టివి యెట్టితొందరలు లేకనే—తమ జీవితనాట్యములలో యేలాటి హెచ్చుతగ్గులు లేకనే—ప్రపంచమున కెట్టిబాధలు వారివలన తగులకనే జరిగిపోవుచుండును గాని, కొన్ని జీవితములందు మాత్ర మట్లుగాదు. అచ్చటనె నే ప్రత్యక్షమగుచున్నాను. ఒకడు భాగ్యవంతుఁడు కాను కాను తన కృత్రిమబుద్ధి యింక నెంతవఱకు బోవునో జూచుటకొరకై యాతనికి భాగ్య మింకను నొసఁగుచుంటిని. మఱియొకఁడు నిరుపేద కాను కాను దైవభక్తి, ప్రేమ, ఓర్పు, యెంతవఱకు నిలువఁబెట్టు కొనగలఁడో జూచుటకై లేమిడిని గలుగఁజేయు చుంటిని. అంతియేకాని బీదను గష్టపెట్టవలయునని నా యుద్దేశముకాదు. యాతనినింకను నా దాపునకుఁ జేర్చుకొనవలయు ననియే యట్లు జేయుచుంటిని గాని వేరుగాదు, దెలిసినదా! ఇక మిగిలినదేది నే నెచ్చట నుంటిననియేనా! నే నన్నిచోటు లుంటిననుట నీ వెఱుఁగనే లేదా! నేను ప్రతిదినము బ్రతి వస్తువునందు నా యందము, నా బలము, నా తేజస్సు, నీకు జూపుచున్నప్పుడు నిక నా దర్శనముతో ప్రత్యేకముగ నీకుఁ బనియేమి! సూర్యు

నిజూచినప్పుడు నే నెంతటి తేజస్స్వరూపుఁడనో యతఁడే యింతటి ప్రకాశవంతుఁడు గానున్నప్పుడు యట్టి కోటిసూర్యుల సృజించిన నే నెంతటి కాంతివంతునిగ నుందునో యూహింప లేకపోతివా! భానుని తేజమే జూడలేక కన్నులట్టె మూసికొని గిఱ్ఱున దిరిగి యే గోడకో ఢీకొట్టు నీవు నన్నుఁ జూడఁగలవా! జూచియు నీవు బ్రతుకఁగలవా! నాచే సృజింపఁబడిన శిరీషపుష్పమును జూచినప్పుడు నే నెంతటి సుకుమారుఁడనో—గులాబిపుష్పముఁ జూచినప్పుడు నే నెంతటి సువాసన గలవాఁడనో—మృగేంద్రమును జూచినప్పుడు నే నెంతటి శక్తిసంపన్నుఁడనో—నీకుఁ దెలియుటయే లేదా! అట్లే సృష్టిలోని ప్రతి వస్తువును జూచినప్పుడు నే నందులో నీకగపడి నాలోనున్న ఒక్కొక్క గుణమును నీకు విశదీకరించుచున్నను నీవు గ్రహింపఁజాలనప్పుడు నీవు నన్నెట్లు జూడగలవు! నా సృష్టిలోని వస్తువుల ప్రకాశమే నీ కన్నులు జూడఁజాలక మూతలు వడినప్పుడు, పుష్పములసౌరభముఁ జూడఁజాలక ముక్కులో రక్తమేకధారగఁ గారినప్పుడు, యిక నన్నెట్లు యే కన్నులతోఁ జూడఁగలవు! నన్ను జూచిమాత్రమున నీకు గలుగు లాభమేమి! నా యాజ్ఞనే మితిమీఱి నడుచుచుండు నీకు నా దర్శనముతోఁ బని యేమున్నది! ఇక గ్రుడ్డివారు, కుంటివారు, శక్తిలేనివారు, కుష్ఠురోగులవారు—అవయవములు లేనివారు—యెందులకు సృజించితిననియా! నీ ప్రేమ నట్టివారియందు యెంతవఱకుఁ బోనిత్తువో కనుగొనుట

కొఱకే—నీ శోక నీతిని బోధించుటకొఱకే వారు బ్రతుకు చుండిరని తెలిసికొనుము. వారుండుటచేతనే నీ వింకను నా కెక్కువ కావలయును. నేను యాకాశ మంటుకొనవల యును నను నాశ నీలో నడుగంటుచున్నది. వారి జీవితము లను నీ జీవితమున కేసి పోల్చుకొనినప్పుడు నీ వెంత హెచ్చు స్థితిలో నుంటివో వారిపైకన్న నీపై ఎన్నిరెట్లధికముగా నా ప్రేమ నీయందున్నదో దెలిసికొని నీ యాశకు స్వస్తి గొంత వఱకైన జెప్పుకొనుచున్నావు—వారివలె నన్ను జేయకుమని ప్రార్థించు చున్నావు — వెఱ్ఱి వెఱ్ఱి చూపులు చూచు చున్నావు. తెలిసినదా, జాగ్రత! ఇకను జెప్పవలసిన దెం తయో యున్నది. ఇప్పుడు మఱియొకచోటికేగ వలయు నను చు నదృశ్యురాలై యా నీడ కూడ యాకా శరాత్రిలో లీనమైపోయెను. ఆ నీడ యదృశ్య మగు నరికి నాకుంగూడ కునుకుబట్టినది. రాత్రి చాలభాగము నిద్ర లేక గడుపుటచే ఉదయమున యెంత ప్రొద్దెక్కినదియు తెలి యక నే నిద్రించుచుంటిని. నా భార్య వీధి నమ్ముచున్న పెరు గును దీసికొని కాంబోలు ఆ పాత్ర చేతం బట్టుకొని యింటిలో నికిం బోవుచు నే నింకను నిద్రించుటంజూచి నన్ను సమీపించి “ఏమండీ! అందరికి జెప్పుచుండు నీతులు వారికేగాని, మీకుం గాదనుకొనియెదను. సూర్యోదయమైన నిద్రించరాదని నన్నే కరవు బెట్టుచుండి యెనిమిదిగంటలయ్యె నింకను నిద్రించుచు న్నారే యని నా నిద్రాభంగముం జేసెడిసరికి “నన్ను నధిక్షే

పించునంతటి దానవైతివా! కన్నులు తలకెక్కినవా యని యా నిద్ర మైకమున కన్నులు మూసికొనియే కోపమున నా చెయ్యి విసరితిని. యా విసరునకు నా భార్య చేతనున్న దధి పాత్ర బోరిగల నా తలపైఁ బడినది. నిష్కారణకోపమునకుఁ దగిన శిక్షయయినదని లజ్జితుడనై స్నానముఁ జేయుటకుఁ బోతిని.

ఓం, శాంతిః, శాంతిః, శాంతిః.

---

# ౪

## దే వేం ద్ర లో క ము

ఒకనాటి మధ్యాహ్నము అప్పుడే కొంత విశ్రాంతికై పండుకొని కన్నులట్టె మూసికొంటిని. కాని యెంతయో సేపు పండుకొను భాగ్యము నాకబ్బలేదు. ఉన్నటులుండి శనిగ్రహమువలె మా ప్రక్కయింటి పాపయ్యగారు విసవిస, నే నున్న చోటికిఁ బరుగిడి వచ్చి, "ఏమయ్యా! తెలియనేలేదా! నీకింకను దెలియనేలేదా! యింకను నీకు తెలియనేలేదా! అయ్యో యింత పాడునిద్రయా! ఇంత సోమరితనమా—ఇంతటి తెలివి లేనితనమా! లోకమంతయు, కాదు కాదు యిచ్చటినుండి దేవేంద్ర లోకమువఱకుఁ గూడుడికిన ట్లుడుకుచున్నప్పుడు నీ కింకను దెలియనేలేదా! ఈ యూరి కొక సన్యాసి ప్రత్యక్షమైనాఁడు, హే, హే, హే, యేమి తేజస్స్వరూపము, యేమి యనందమూర్తి! అట్టి మహనీయుఁడు, అట్టి పావనుఁడు, అట్టి తపస్వీలుఁడు—సర్వజనమంగళముకొఱకు—మనకు బుద్ధివచ్చుట కొఱకు—మనమట్టె జీవితములలో మార్పు గలిగించుకొనుట కొఱకు—విశాలభావములు మనలో పెంపొందించుకొనుట కొఱకు యీ దినము నాలుగు గంటలకు, సరిగ నాలుగు గంటలకు—నిక్కరముగ నాలుగు గంటలకు, కన్యకాపరమేశ్వరీ సత్రములో ఉపన్యాస మిచ్చెదరఁట. దెలిసినదా! ఓహో విను చుంటివా నేను జెప్పుచున్న దంతయు వినుచుంటివా—

ఇంకను గురకయేనా—నీ గురక కాలిపోను—లేయవయ్యా—లేయి, అతఁడే మనపాలిటి బ్రహ్మ—అతఁడే మనపాలిటి కల్పతరువు—అతఁడే మనపాలిటి పంచాక్షరీ—ఏమి ఇప్పటికైనను దెలిసికొంటివా! ఓహోహో! నేనీ దినమే యాతనిని జూచితిని—ఏమి యాతని వైభవము—ఏమి యాతని విభూతి పెండెకట్లు—ఏమి రుద్రాక్షమాలల యలంకారము-ఱ—ఏమి కాషాయవస్త్రధారణము—ఏమి ఏమి...... నేను జెప్పు విషయములలో నీకు నమ్మకమే లేదా—ఇతఁడందరి సన్యాసుల వంటి వాఁడు కాదు—ఇతనిరీతి వేరు—ఇతని నడవడిక వేరు—మార్గము వేరు—యాతఁడు జేసిన విభూతి ధారణ తనలో నున్న విమలస్వభావము వెలిఁబుచ్చుటకేగాని బూటకము కొఱకు కాదు—యాతఁడు వేసికొనిన రుద్రాక్షమాలలు తనలోని రుధిరౌన్నత్యముఁ దెలుపుటఁకేగాని వేషముకొఱకు గాదు—అతఁడు ధరించిన కాషాయవస్త్రములు తినలోనికి జొరని కామ క్రోధ మద మాత్సర్యములకు సాక్షీ భూతముగఁ గాని యితరుల మోసపుచ్చుటకుకాదు—ఏమి ఇప్పటికైనను తృప్తిఁ జెందితివా—ఇంకను అనుమాన మేనా యని యనెను—అందులకు నేను నీవు కూడ మంచివకీలువే, ఫీజెంత మాట్లాడుకొంటివి యని యంటిని. అందుల కాతఁడు నీ బుద్ధికిఁదగినట్లు మాట్లాడుచున్నావు! నీజన్మమునకుఁ దగినటుల జాలము చేయుచున్నావు. లేయి, ఇచ్చటనుండి లేయి, లేకున్న కాళ్లుగట్టియైన దీసికొని పోవుదును. అచ్చటికి బోయినవుడు

నీ కన్నియుఁ దెలియఁగలదని నన్ను వెంటఁగొని సత్రమునకుఁ దీసికొని పోయెను. మే మచ్చటికిఁ బోవునప్పటికి జనులు కిటకిట నిండియుండిరి. నేనును పాపయ్యయును జనులను ద్రోసికొనుచు ఒక మూలనున్న యరుగుపై గూర్చుంటిమి. అప్పటికి అగ్రాసనాధిపతిగాని సన్న్యాసిగాని వచ్చియుండలేదు. నేను సభ నలుప్రక్కలను నొకపరి గలియఁజూచితిని. ఓహో యెచ్చటఁ జూచినను స్త్రీలు పురుషులు సమానముగ జత జతలుగ—ఒకటికి రెండుగ—రెండింటికి కారుగ—కూర్చునియుండిరి. దేవుఁడు స్వభావసిద్ధముగ సృష్టించియున్న రూపభేద మొకలాగుండినను స్వయముగ రూపభేదము గల్పించు కొనినవారు చాలమంది విచ్చేసియుండిరి. ఏహే, చీమిడిముక్కు మీసములు—గొత్తికొమ్ముల మీసములు—సూదికొనలమీసములు—ముందుకు నిగుడుకొనిన మీసములు—నలుపు తెలుపు గలిసిన మీసములు—రంగువైచుటచేఁ గలిగిన యెఱ్ఱమట్టిమీసములు—కోరమీసములు—నారమీసములు—బోడి మీసములు—మంగలికత్తికి మొగమువాచిన గడ్డములోనుండి మినుకు మినుకు మని గనబడుచున్న మీసములు—రెల్లువలె యచ్చటచ్చట మొలచిన మీసములు—బోదకసవువలె తెగబలసిన మీసములు—బోడితలలు, బట్టతలలు—జుట్టుతలలు—దబ్బతలలు—కోలతలలు—గుండుతలలు—ఓపన్ కోట్లు—క్లోస్ కోట్లు—పొడుగుకోట్లు—రవికలవలె నడుముపై కెగబ్రాకిన కోట్లు—యెచ్చటఁ జూచినను నిండి నిబిడీకృతముగ నుండెను.

ఆంగ్లభాష నేర్చిన ఒక స్త్రీ ఒక లంబోదరిని జూచి ప్రక్కనున్న తన చెలియతో (See that casket, Rollsroy, water tub, Hemisphere) ఆ పీపాను, రోల్సు రాయిని ఆగోళమును చూడమని జెప్పి కిసిక్ అని నవ్వుచుండెను. ఆంగ్లభాషా వాసన దగిలిన ఒక లలన తనకుఁగూడ ఇంగ్లీషు వచ్చినదని యనిపించుకోనవలయు నని కాబోలు తన ప్రియుని జూచి ప్రియుడా (డీర్) ఆకామల్ (Camel) మెడను ఆ గూబ ఐలును (Eyes) ఆ సార్టుహేర్లును (Short hairs) ను జూచితివా యని నగల గులుకుచుఁ జెప్పుచుండెను. ఇంతలో పాపయ్య మునిగిపోయినవానివలె జూచితివా అహాహా యేమి యానందస్వరూపమో జూచితివా యని నా చేయి బట్టి లాగి లోనికి వచ్చుచున్న సన్యాసిని జూపెను. అతఁడు యిరువది అయిదేండ్లు మించని ప్రాయమువాఁడు. మంచి రూపరి, తెలివితేటల మొగము. ఇంతే యా తనిని గూర్చి నా పేనా యింతే వర్ణింపఁగలదు. ఇంతలో నా ప్రక్కనున్న ఒక్క వనిత యాతనిని జూచి (Most excellent, Cupid-like fellow) సెబాష్ మన్మథునివంటి వాఁడు అని గొణుగుకొనుచుండెను. ఒక మూలనుండి ఒకఁడు (Yes a pure Himalayan export) హిమాలయమునుండి యెగుమతియయిన బాపత్తే యని యనెను. ఎచట జూచినను గుసగుసలే. నేను మాత్రము పాపయ్యతో "శరీరసౌందర్యము నీ వనినట్లే గాని హృదయ సౌందర్య మెట్లోగదా" యని యంటిని. పాపయ్య

నామాటలు చెవిలో వేసికొనలేదు. (Tom Tumbler) టాం టంబ్లర్ అను నొక ఉద్యోగి అగ్రాసనాధి పత్యమునకు నొప్పు కొని సన్యాసితో వచ్చి కూర్చుండెను. సన్యాసి పైకి లేచి కన్నులట్టపై కెత్రిప్పి ముక్కు బట్టుకొని తర్వాత సభవంకకు దిరిగి చిరునగవు నగుచు యిట్లుపన్యసింప మొదలిడెను.

అగ్రాసనాధిప సభ్యులకు: సముద్రగర్భమున దాగి యున్న వజ్రములు మన చేతులలో బడి తమ ప్రకాశము చూపలేకుండుటచే మీరిప్పుడు జూచుచున్న వజ్రములే ప్రకాశవంతములని యనుకొను చుంటిరి. మీతలలపై జేరి తమయందముజూపుటకు వీలుగాక అరణ్యములలో వాడి నశించుచున్న పుష్పములు మీకన్నులఁ బడనందుచే యిప్పుడు మీరు చూచు పూవులే సౌందర్యముఁగలవని యను కొనుచుంటిరి. మీమధ్యకువచ్చి తనజ్ఞానమును ప్రకాశింప జేయ వీలుకలుగక మూరుమూలలో పేరును, యూరును లేక జనిపోవువారు మీమధ్యకు రానందుచే మీరే గొప్పవారను కొనుచుంటిరి. ఆట్లే మీరు చూడజాలని ప్రదేశముల సంగ తిని గూర్చి జెప్పిన యది నిజము గాదని యనుకొనెదరు. గాని నేను మాత్రము మీరు చూడని విషయములను గూర్చి జెప్పెదను. మీరు నమ్మినను నమ్మకయున్నను నాదితప్పు కాదుగదా? (నమ్మనివిషయములు నమ్మునట్లు చెప్పవుగదా అని యఱుపు) ఓహో! మఱచితిని మీరందఱు నరులుగదా! (మేము నరులము నీవు నరకాసురుడని కేకలు) మీకు మాధ్యో

రణి, మా వడవడి, మా యూహలు, అర్థములు గావు. ముఖ్యమగు విషయములను గొన్నిటిని చెప్పెదను వినుఁడు. నేనొకనాఁడు శివునిజూడ నిచ్ఛ బొడముటచే కైలాసపర్వతముఁ జేరితిని. అలనాఁడు రావణుఁడు తన బాహుబలముఁజూప కైలాసపర్వతము క్రింద తన యిరువదిచేతులు వైచి కదలించి నప్పుడు అచ్చటచ్చట శిథిలముజెందిన యా పర్వతములోని భాగముల యాత్రినేత్రుఁడు తన సేవకులచే సరిజేయించుచుం డెను. ఆమహానుభావుఁడు నన్ను జూచి యేమయ్యా, ఉదయ మున నే ప్రత్యక్షమైతివి. రమ్ము. లోనికి బోవుదమని వారినిల యములోనికిఁ బిలుచుకొని పోయెను. మేము బోవునప్పటికి వినాయకుఁడు యొక పెద్ద పళ్లెరమున కుడుములు గుట్టవలె బోసికొని మెసవుచుండెను. శివుఁడు యాతనినిజూచి ముఖ మట్టె నేలకు వంచెను. అదిచూచి స్వామీ! మీచింతకు గతం బెయ్యది యని యంటిని. అందుల కాతఁడు వినాయకుని ముఖమును చూచినపుడెల్ల నాకిట్టిచింతయే గలుగుచుండెను. సర్వలోకముల కారణకర్తయగు నేనే—యెందరో భక్తుల మొరలవిని వారికి వరములిచ్చి బ్రోచు నేనే—నా కుమారు నికి సరియగు తల నమర్పలేక యేనుగుతలను బెట్టి యతికించు కొనునంతటి యసమర్థుఁడనైతినిగదా యని దలఁచుచుందును. ఈ మాటలకిప్పుడేమిగానిమంచిసమయమున కేవచ్చితిని. నేను దేవేం ద్రలోకమునకుఁ బోదలంచుచుంటిని. నావెంటరమ్మన, నేనును లెస్సని యాతని వెంట బోయి దేవేంద్రభవనముఁ జేరితిమి.

సభాసదులారా! ఇక్కఁగవినుఁడు. మీరు వినవలసిన దంతయు నీసమయముననే మీమనస్సంతయు లీనముగావలసిన, దీవిషయముననే, మేము దేవేంద్ర లోకముఁ జేరితిమి. ఓహో అచ్చట స్త్రీ పురుషుల భేదమే లేదు. ఈర్ష్యలేదు, మాత్సర్యమే లేదు, తప్పు లేదు, వారు వీరితో గుసగుసలాడుట, వీరు వారిచేతులలో చేతులు గలుపుట, వారు వీరితో దేహములు యొరసికొనుట, వీరు వారితో వాహ్యాళి వెడలుట, యంత తప్పులోనిదిగ పరిగణింపఁ బడుటలేదు. ఆహా! అచ్చట యెప్పుడు కిలకిలలే, గలగలలే, జలజలలే, (అక్కా! అట్టిలోకమున నున్నవారి పుణ్యమే పుణ్యమని సభలోనున్న నొక్కవనిత మెల్లగ సంబోధించెను.) ఐరోపా అమెరికా దేశస్థులుగూడ యిప్పుడిప్పుడు ఆ సరణినే త్రొక్కుచున్నారు గాని వారివలె పూర్తిగ యీయానంద కరమగు విషయమును ఈ పరమార్థమును, ఈ సంతోష సంఘటనమును, ఈ సాంఘిక సదాచారమును నేర్చుకొనుటకుఁ జాలదినములు పట్టును, మనదేశమున విడాకుల చట్టమను నది (భార్య భర్తను విడుచుట భర్త భార్యను విడచుట) లేదుగదా, స్త్రీ జనంబులగు మీకిప్పు డిప్పుడు తల లెత్తి మాకు విడాకులచట్ట మవశ్యకమని నెత్తిన నోరు పెట్టుకొని గొట్టుకొనుచున్నను వాని యావశ్యకత గమనించి మిమ్ము లాదరించువారు లేరైరి. ఆలోకమున, ఒక స్త్రీ తన యిచ్చవచ్చినటులఁ దిరుగ వచ్చును ఆమెను ఆమెపురుషుఁ డడ్డు పెట్టఁజాలఁడు. అట్లే పురుషుఁడుగూడఁ జేయవచ్చును.

ఇంతయేల వివాహసంబంధము అచ్చట యేవ్యక్తి స్వాతంత్ర్యమును బంధింపఁజాలదు. (ఆలోకముననే యట్లున్నప్పుడు యీ దిక్కుమాలిన మొగ ముండకొడుకుల పోరు యిచ్చట బడజాలకున్నామేయనియచ్చటనున్నఒక స్త్రీమణియొకయామెతో గుసగుసననెను) ఆహా! ఈస్వాతంత్ర్యానందమునుబట్టియే అది దేవేంద్రలోకమని పిలువఁబడుచున్నది. అట్టి స్వాతంత్ర్యమనుభవించని పుట్టుక యొక పుట్టుకా! ఒక నిదర్శనము మీకెఱుకపరచెదను చిత్తగించుఁడు. రంభాసంయోగము యెవరెవరికిఁ గలదో మీకే దెలియదా! యుద్ధములో చచ్చినవాఁడైనసరే, యజ్ఞముఁ జేసినవాఁడైన సరే, వాఁడు సాహెబుగాని శాస్త్రులుగాని—మహీపతిగాని మాలమాదిగగాని—పాచ్చాగాని పకీరుగాని–దొరగాని దూదేకులవాడుగాని—మనోహరమూర్తిగాని మొండి రూపముగలవాఁడుగాని సోమయాజులుగాని సోమణిగాని—యెవరుగాని సరే ఆమెతో సంయోగప్రాప్తి గల్గియు యామె దేవలోకపదవి యనుభవించుచున్నప్పుడు యిక నరులలోయీరిమ్మ తెగులెందుకు (ఈరిమ్మ తెగులెందులకా, ఆడవారిని తమచేతి బొమ్మలవలెఁ జేసికొనుటకని యొకమూల నుండి యరపు) ఇంకొకమాట ఊర్వసి అర్జునునిచే నిరాకరింపబడి కోపోద్దీపితమానసయై యాతనిని పేడిగమ్మని శపించినది చూచితిరా, ఆ లోకమున స్త్రీ పురుష భేదమే యున్నచో—మోహము లజ్జాకరముగ భావింపబడుచున్నచో—కామోద్రేకమగు చేతలు పాపమని పరిగణింపఁబడుచో—ఆమె శపించు

నంతటి ఔచిత్యము గలిగియుండునా—ఒకవేళ కోపమున వదరెపో ఆమె మాటప్రకారము నిరంతర నారాయణపాదపద్మ ధ్యానైక తత్పరుండును, న్యాయైకశీలుండు నగు నాగాండీవి కిట్టి శాప మంటునా! ఆహాహా! తాటాకుచప్పుడులకు తోడేళ్ళు భయపడుటా! అంతటి నిరంతరహాసమయమూర్తి, అంతటి వీర చక్రవర్తి, ఒక్క త్రుటిలో—కను మూసి కను తెఱచు నంతలో—బదులుమాట జెప్పుచున్నంతలో పేడిమూతి యైపో వునేనా, ఊర్వసి యట్టి దుర్మార్గవుంబనిని జేసియు పాపినైతి నిగదా యని వెరువక పుణ్యకార్యాచరణమందే మనసుంచిన యా దివ్యమూర్తికి శాపమిచ్చుట కేవగించినదికాదు. అట్టి యామె పాపినిగ పరిగణింపబడియున్నచో ఆమె శాపమునకు శక్తియే యుండునా! ఫల్గుణుని రూప మార్పనేర్చి యుం డునా! దేవేంద్రుఁ డట్టి వ్యభిచార కుతూహల మానసి యగు యా మగువను ఒక్క మాటయైనను బలుకకయే, కయ్యన కయే, కుయ్మనకయే, మరల యట్టి దుర్మార్గురాలిని తన ప్రేమైకపెన్నిధానముగఁ జేర్చుకొనునా! మన పూర్వగ్రంథ కర్తలు యట్టి మిటారికథను పాపమునకు ప్రాముఖ్యత యిచ్చి తమ గ్రంథములలో వ్రాసికొన వీలుగలిగి యుండునా (అమ్మా జూచితివటే! నీ శ్రీరంగనీతులు కాలిపోను రంకునకున్న రంగు అని ఒక వితంతువు తన తల్లితో ననెను) మా కన్నుల ముందే నిత్యము నాట్యమాడుచుండు మఱియొకవిషయము విన్నవించెదను వినుఁడు. ఇదిగో ఇదిగో—యనునప్పటికి

ఒక వనిత యాతఁడేమో జూపించుచుండెనని దలచి పైకి లేవఁబోవగ యామె పైటచెఱగు పొరబాటున తన ప్రక్కననున్న యొక యువకుని పృష్ఠభాగముక్రింద తగులుకొనుటచే ఆమెను లేవనిచ్చినది గాదు సరిగదా ఆమె లేచిన విసరుతో వెనుకకు ఆతనిమీద బడినది ఆతఁడును ఆమెను కోపవీక్షణముల బరికింపక అట్టె మెల్లగ లేవనెత్తుచు "దేవేంద్రలోకముననే యట్లున్నప్పుడు మన సంగతి కేమి" యని యామెను ఓదార్చుచుండెను. మరల అతడిట్లు వుపన్యసింపదొడగెను. ప్రతి పటమునందును లోకైకనాయకుండగు విష్ణుమూర్తి తన తొడపై లోకకల్యాణిని యగు లక్ష్మీదేవిని గూర్చుండ బెట్టుకొని చిరునగవునగుచు యానందసముద్రమున మునిఁగి దేలుచున్నట్లు జూచుచున్నాము, మఱియొక పటమునందు సకలవేదాంత రహస్యజ్ఞుఁడగు ఈశ్వరుఁడు నెత్తిపైన భార్య, ప్రక్కన భార్య, నిడుకొని సంతోషసాగరమున దేలియాడుచున్నట్లు జూచుచున్నాము. కొన్నిపటములందు యవతారమూర్తి యగు శ్రీకృష్ణుఁడు ప్రక్క నొక స్త్రీ—వెనుక నొక స్త్రీ—ముందుననొకస్త్రీ—యేప్రక్కఁజూచిన నాప్రక్కనొకస్త్రీని నియమించి వారి మధ్య తాను నాట్యమాడుచున్నట్టును యింకను గొన్నిటియందు యాతఁ డొక కోమలి కన్నులట్టె వెనుక నుండి వచ్చి మూసి యాడుచున్నట్టును మఱియొకచోటు ద్రౌపతీ వస్త్రాపహరణము మననమునకుఁ దెచ్చునట్లును ఒక చిగురుబోణి చీరను నీడ్చుచున్నట్లును ఇంక నొకచోట నొక

ముదితను ముద్దిడుచున్నట్లును, నొక వాల్గంటి వేణినిబట్టి లాగుచున్నట్లును జూచుచున్నాము. గుళ్లయందును గోపురములందును మన మింకను యనేకవిధములగు విగ్రహములను సాక్షాత్తుగ జూచుచున్నాము. అందులో గౌరవభావము లేకుండెనేని మన పూర్వులు యట్టి వానిని పవిత్రస్థలములఁ జేర్చ నిచ్చగించియుండరని యనుకొందును. కొనువారే లేకున్న యట్టి పటముల వేనకువేలు చిత్రింపఁబడుచుండునా! మీరే యోచించుకొనుఁడు. నే నొకనాడు ఒక తేరువద్దఁ గూర్చొనియుంటిని. కొందరు చిన్నపిల్లలు ఆ తేరున నొక ప్రక్క చిత్రింపఁబడియున్న బొమ్మను తమ వ్రేళ్ళతోఁ జూపి కిచ కిచ నగుచుండిరి. అంతలో నొక యువతీలలామ ఆ దారిని బోవుచుండ ఒక బాలుఁడు ఆమెను బిలిచి "అక్కా యీబొమ్మను జూడవే యెంత బాగున్నది" యనియెను. ఆమెయు నా తేరును సమీపించి బొమ్మను జూచి ముఖము జేవురింప ముసి ముసి నగవులు నగుచు నచ్చట నెవరైన తన్ను జూచిరేమో యని క్రీగంట జూచుచు తన దారిని బోయెను. ఆమె యటు పోయెనో లేదో డెబ్బదివత్సరముల ముసలివాఁ డొకఁడు చేతికఱ్ఱనూతఁ బొడుచుకొని యా దారిని బోవుచుండి యీ పిల్లల కిచ కిచలు విని అచ్చటకుఁ బోయి వారు జూచుచుండిన బొమ్మనుజూచి చక్కగఁ గనపడలేదని కాబోలు చేతిని కన్నుల కడ్డముగ బెట్టుకొని జూచి అప్పటికిని తనివినొందక యా బొమ్మను దన చేతితో తడవి "ఈ బొమ్మను జిత్రింపజేయుటకు

యెవరిడబ్బు ఖర్చు అయినదో దెలియునంట్రా మా స్వంత మేనమామ దేసుమా" అని యాతని మామను గీర్తించుచుఁ బోయెను. ఇంతమంది నాకర్షించిన యా బొమ్మను నేనును జూడవలయునని బోతినిగదా, అదేమనుకొంటిరి. ఇంకేమియు కాదు. ఒక సాహేబును హిందూవనితయును దిగంబరులై సరససల్లాపమానసులై, కామశాస్త్రానుసారము పట్టు విడుపులతో నున్నట్లు జిత్రింపబడిన నొక ప్రతిమ! జూచితిరా! అట్టి బొమ్మనుజూచి ఆ ముదుసలిసహితము పిల్లల నదిలించుటకుబదులు తానే ముచ్చటబడి తాకి తదేకధ్యానముతోఁ జూచెను. మన పెద్దలు యట్టిబొమ్మను, మానసీ యుండగు మాధవునివిగ్రహమును గూర్చుండబెట్టు పవిత్రస్థలమున, జెక్కించుటకు సిగ్గుపడినవారు గారు. జనులకు యాదర్శప్రాయుఁడగు విష్ణుమూర్తి యందరును జూచుచుండగ సిగ్గనక, బిడియమనక భార్యను తొడపై లాలించుచున్నప్పుడు శ్రీకృష్ణుఁడు జంకు గొంకు లేక, స్త్రీలమధ్య కాసంత మరుగైన లేక, చేయరాని పనులఁ జేయుచున్నప్పుడు (ఇదియంతయు చిత్రకారుల బుద్ధిలేనితనముగాని యా పాపమూర్తి తప్పుగాదయ్యా అని యఱపు) కానిమ్మయ్యా, కానిమ్ము. అట్లే యది చిత్రకారుని కుంచె కొనలోని తప్పగుచో మీా రెందుల కట్టివిబోలెను బొమ్మల గొని యింటికిఁ దీసికొనిపోవుచున్నారు. ఇట్టి కామోద్రేకకరమగుబొమ్మలఁజూచి మీా బిడ్డలు సర్వేశ్వరుని గూర్చి దురభిప్రాయబడుదురనియు, వారి జీవితములలోఁ గూడ నిట్టి

హేయమగు మార్పులుగలుగుననియు మీరుదలచియున్నచో అట్టిపనులకు మీ రెడమిచ్చి యుండరుగదా! మనపూర్వుల కట్టి యభిమానముండఁ బట్టియేకదా! విద్యావంతులు, అఖండ పండితాగ్రేసరులు సహితము యట్టివారి దారినే ద్రొక్కిరి. వా రిట్టి విషయములఁ దప్పుగ గ్రహించి యున్నచో వారి వ్రాతలలోఁగూడ గొంచె మట్టిగౌరవముఁ జూపించియుండరా! అంతటివా రేయట్లున్నప్పుడుమీకుమాత్ర మేమి. యోచించుడు. కుమారుఁడుతండ్రినిజేరి తండ్రీ "అమ్మకన్నీరు స్తనములపైఁబడి దొరలునట్లు యేడ్చుచున్నదని" యనిన వాని తండ్రి కుమారునికిఁ దల్లిపైఁగల పరామర్శ భావము గ్రహింపక రెండుచెంపలు వాయించక విడుచు చున్నాఁడా? "మీకుమార్తె. హారములన్నియు రొమ్ముపై చిందరవందరగు నటుల నిదుర బోవుచున్నదని చెప్పిన సేవకుని యజమానుఁడు మూతిపై గొట్టకుండ నున్నాఁడా! "అయ్యా! నీ భార్యను నీవు సిగఁ బట్టి యీడ్చిన దెబ్బ ఆమె కేశములు యామె పిరుదుఁ గప్పి వేయునట్లు క్రిందికి దిగఁజారినవని" యనిన స్నేహితుని మన్నించుచున్నాఁడా, లేదే! మీరేమి కవీశ్వరులకన్న యంత తెలివిగల్గినవారా, భార్యలవిషయములు వ్రాయించుకొనిన లోకకల్యాణమూర్తుల కేకోపమురానప్పుడుయిక మీ నీల్గులేమి,మీకంతకోప మెందులకు, దేవేంద్రలోకమునకును, ఈలోకమునకును గల తారతమ్యమునా వెంటఆలోకమునకు వచ్చిజూడుఁడు, నేను దీసికొనిపోవుటకు సిద్ధముగనున్నాఁడను. అచ్చటస్వాతంత్ర్యమే

స్వాతంత్ర్యము, అచ్చటి యానందమే యానందము, అచ్చటి హాయియే హాయి, అదుగో! అప్పుడే మబ్బులు గ్రమ్ముచు న్నవి, సెలవు పుచ్చుకొనెదనని జెప్పి యాతఁడు కూర్చొనెను. ఇంతలో భార్యా ప్రేరితుఁడగు ఒక మొదలియారు అతని వద్దకుఁబోయి, తాము సాక్షాత్ పుణ్యమూర్తులు, కైలాస మును దర్శించినవారు, తపోనిష్టాగరిష్ఠులు దయయుంచి మా యింట రెండుదినములుండి నాయిచ్చు నాతిథ్యముఁగొని మా గృహము పావనము జేయవలయునని ప్రార్థించ యెట్టకేలకా సన్యాసి వల్లెయని తలయూపెను. సభ ముగియ వచ్చినది.

అగ్రాసనాధిపతు లగు మ. రా. రా. శ్రీ Tom Tumbler (టామ్‌టంబ్లర్) గారు లేచి యిట్లుపన్యసించిరి. "జనులారా! వందనాలు, షన్యాషిగాఁడు (గాఁడు కాదయ్యా గారని చెప్పుడు యని యరపు) అవునవును. మన్నించవల్ల. షన్యాసిగాఱు షెప్పినది అంతానిజము, మనము బేదాలు పెట్టుకుంటే బతకాజాలము. మగవాఁడూమనిసే ఆఁడవాడు మనిసే, మీాకు వందనాలు, అని కూర్చుండెను. ఈ సభ జరి గిన మూఁడుదినములకు శ్రీ సన్యాసిగారు మొదలియారుగారి సతీమణికి దేవేంద్రలోకముఁ జూపింప నెవరికిఁ దెలియకనే బిలుచుకొని బోయిరని వింటిని.

---

## ౫

## కాలమా నీ కొక వందనము

ఊహూ! మీరు వినరు మీ కంత ఓర్పులేదు ఓర్పున్నను మీ ఆంగ్లసారస్వత రసాస్వాదనాపారీణతలో మీ కిది సహించదు—రుచింపదు—గనిపింపదు—వినిపింపదు —యేమైన గానిండు నా యేడ్పు నేను యేడ్చి తీరెదను, యెందుక నెదరా, యేడ్పునకున్న శక్తి మరి దేనికి గలదనుకొంటిరి. భార్య యేడ్చెడి యేడ్పునకు భర్త యామె కాళ్ళు బట్టికొని వలదు వలదని మూల్గుచున్నపుడు—బిడ్డల నిష్కారణపు యేడ్పునకు తల్లుల కడుపు లవిశిపోవుచున్నపుడు—అంబా యని యేడ్చు దూడ యేడ్పునకు ధేనువు పొదుగున క్షీరమూరినపుడు—లోభి యేడ్చెడి యేడ్పునకు ధనము చేకూరునపుడు భిక్షుకుని యేడ్పున కుదార హృదయము తపించినపుడు—శిక్షితుఁడగు బాలుని యేడ్పు మాన్పించుట కుపాధ్యాయుఁడు పడరాని బాధలు పడినపుడు ఇక నా యేడ్పునకు మాత్రము కొంతవఱకైన ఫలిత ముండదా! మీ మాతుల త్రిప్పుకొనక వినుడు. నే నొక యూరికిఁ బోవుచుంటిని. నాడు ప్రవరాఖ్యుని కెదురుపడిన గోసాయివంటి వాఁడొకఁడు నన్ను నిలిపి గొంత పసురు నిచ్చి నేనా పసురును శరీరమంతయు పూసికొనిన నే నొరుల కగుపడననియు జయ పరమేశ్వరా యనిన యనుకొన్న చోటికి బోవుదునని చెప్పెను. అప్పుడు నాకు గలిగిన సంతోషమునకు మితిలేదు. అట్టి దైవత్వము నా కొసఁగిన ఆ గోసా

యికి కనకాభిషేకము జేయవలయు ననుకొంటిని గాని నా జోబీయందు నాలుగు దమ్మిడీలు తప్ప యేమియు లేనందున పత్రి కైంకర్యమునకై ఆ డబ్బు లతని చేతిలో బెట్టి ఆ పస రును దేహమంతయు బూసికొని జయ పరమేశ్వరాయని యం టిని. వెంటనే నే నెచ్చటికో విహంగమువలె యెగిరిపోవు చున్నట్లు దోచెను. యే వరూథినో నాకీదిన మగపడుననియు, నాయక నాయకీపాత్రత బహు యుక్తియుక్తముగ—రస వంతముగ—గంభీరముగ—సాహిత్య సంగీతయుక్తముగ— నాటకము జరుపవలయు ననుకొంటిని గాని నా ప్రారబ్ధము నా కొక కుచేలమహాప్రభు వొకఁడు చినిగి మాసిన వస్త్రములు ధరించి చేత నొకబెత్తము, నెత్తిన గంపంత తలగుడ్డ బెట్టు కొని యెదురుపడియెను. అతనితో నా కేమియని ఒక దీవి జేరితిని. ఆ దీవి నానుకొని మఱి యూరు దీవు లుండుటఁజూచి నేను సముద్రమున కావలనున్న సప్తదీవుల జేరితినేమో యను కొంటిని. ఆ దీవిమధ్య నొక చిన్నగృహము ఆ గృహములో నే నిదివఱకుఁ జూచిన యూసరవిల్లి మహాశయుఁడు యిరువది మంది పిల్లలకు యేమో బోధించుచుండెను. నా కంటె ముం దీతఁ డెట్లు వచ్చెనా యని చాల యాశ్చర్యమొంది ఆతఁడేమి బోధించుచున్నాఁడో చూచెదగాక యని ఆ యింటిలోనికిఁ జొచ్చి ఒకబాలుని వెనుక నిలువఁబడితిని. ఉపాధ్యాయుఁడు హాయిగ కుర్చీపై గూర్చుండి రెండుజేతులను కుర్చీకి వెనుక వైపు వ్రేలాడవేసికొని కన్నులు మూసికొని, ప్రథమావిభక్తి

డు. ము. వు. లు. ద్వితీయావిభక్తి ని. ను. ల. కూర్చి. తృతీయావిభక్తి. చేత. చే. తోడ. తో. అని యట్లె తెఱచిన నోరు దెఱచినట్లె—ఆడినకాలు యాడినట్లె—వేసిన చేతులు వేసినట్లె—నిద్రించు నాతని నైపుణిం జూచి నాకు నవ్వు రాలేకపోలేదు. ఇతఁడు డుక్రుంకరణి మంత్రారంభములో నున్నాడని తలఁచితిని. ఇంతలో నేను నిలిచియున్న వరుసలోని మూడవబాలుఁడు ప్రక్కనున్న వానిని జూచి నేను నా వరుసకు తృతీయుణ్ణి నా విభక్తి చేత. చే. యని వానిని తన చేతి కొలది మోదెను. వానికి మూడవ వరుసలో నున్న మూడవ బాలుఁ డొకఁడు చివాలున లేచి నేను కూడ నా వరుసకు తృతీయుణ్ణే. నా విభక్తి తోడా. తో. యని వాని చేతి కడియముతో ప్రక్కనున్నవాని నెత్తిపై గొట్టెను. ఈ విచిత్ర ప్రహసనముఁ జూచి నాకు పట్టరాని నవ్వు వచ్చియు యాపుకొంటిని గాని యింత సమరము తరగతిలో జరిగియు నుపాధ్యాయుఁడు మాత్రము ఛాయాపటగ్రహణమున కనుకూలముగనే గూర్చొనియుండెను. "విభక్తుల ప్రయోజకత్వము బాలురకు బోధింపక జిలుకలకు వలె విభక్తుల వల్లింపజేయుట వలన ఫలిత మేమి"యని నేను గట్టిగ నంటిని. ఈ నామాటలచే నుపాధ్యాయునికి మెలుకువ వచ్చి బాలురు దప్ప యింకెవరును యాతని కగుఁపడమి బాలురే యీ యధిక్షేపణకును నిద్రాభంగమునకు కారణమని యెచ్చటనుండీ శబ్దము వచ్చినదని నలుదిక్కులు జూచుచుండిన నొక బాలు నా గురువరేణ్యులు తన కసిదీర మోదజొచ్చెను.

నే నచ్చటనుండి జయ పరమేశ్వరా రెండవ దీవికని యనుకొనినంతనే రివ్వున యా దీవి జేరితిని. అచ్చట గూడ నొక గృహమును జూచితిని. యిదియొక చిన్న బంగళావలె నుండెను. నే నిదివఱకే ప్రతి దీవిలోని గృహమును చూడ సంకల్పించుకొని యుండుటచేతను నే నొరులకు పనురు మహత్యమున నగుఁపడనను గర్వముచేతను యేమైన కానిమ్మని లోనికిఁ బోతిని. అచ్చట గూడ కొందరు బాలురును వారి ముం వొక సూట్, హ్యాట్, బూట్ ధరించిన ఒక యుపాధ్యాయుఁడు గూర్చొని యుండిరి. ఓహో! ఏమివింత నా యేడేండ్ల కుమారుఁడుగూడ వారిలో నుండెను. పాఠమప్పుడే యారంభమయినది. ఉపాధ్యాయుఁడు సిట్ (Sit) స్టాండ్ (Stand) అను ప్రారంభతంతు జరిపిన తర్వాత నా కుమారుని కేసిచూచి (You boy there, read the fourth lesson, "ఓబాలుఁడా, నీవు నాల్గవపాఠముఁ జదువుము''యనిసంబోధించెను. అయ్యది క్రొత్తపాఠము కాబోలు బాలులందరు వింత ముఖములతో ఆ పాఠముదెఱచి చూచుచుండిరి. నా కుమారుఁడు చదువు ధోరణిని చూడవలయునని మిగుల నుత్సాహముతో నుంటిని. నాపుత్రుఁడులేచి నిలువఁబడి (I am a cat "నే నొక పిల్లిని" యనిచదివి "నేను కాదు సార్," అని బాలుఁడు త్తరమిచ్చి యూరకుండెను. ఉపాధ్యాయుఁడు వాఁడు జెప్పు మాటలలోని యర్థము గ్రహించక (Dam it, you young fool continue) "ఓ బుద్ధిలేనిబాలుఁడా! నిలువక

చదువుము" అని అరచెడి యాతని బొబ్బరింపులకు మా పిల్ల వాఁడు భయపడి (My name is pussy) "నా పేరు పిల్లి" యని చదివి కాదండి నా పేరు రామ......యని యేమో చెప్పబోవునంతలో నుపాధ్యాయుఁడు (You stupid) "ఓ బుద్ధిలేనివాఁడా" (What) (ఏమి) కాదండి, నీ పిండము (Read on) చదువుము యని మరల గద్దించెను. (When I am hungry I mew) "నేను ఆకలిగ నున్నప్పుడు మ్యావని యరతును" యనియా బాలుఁడు మరువాక్యము జదివి "లేదండి ఏడుస్తా"నని జెప్పెను. ఉపాధ్యాయుఁడు యీ తూరి మిక్కిలి కఠినముగ (You nonsense) "ఓ బుద్ధిలేనివాఁడా ఏమి నీ యేడ్పు" (Do you read or not) నీవు చదివెదవా లేదా యని గొంతుక బొంగుపోవునటు లఱచెను. మరల నా కుమారుఁడు యిక చదువక తప్పదని కాబోలు (At night I hunt for mice) "నేను రాత్రులందు యెలుకలు బట్టుదును" యని మరల ఒక వాక్యము జదివి కన్నులనిండ నీరు దెచ్చుకొని, "రాత్రులలో మాయమ్మ ప్రక్కలో పండుకొంటానుసార్, చిట్టెలుకలు పట్టి తినేదిలేదు సార"ని వెక్కి వెక్కి యేడ్వసాగెను. అప్పుడు తండ్రినగు నే నచ్చట నుండుటచే నా కాదుఃఖము దెలిసినది—వాని బాధ నా కెఱుకపడినది—వాని యమాయకత్వము బోధపడినది—ప్రస్తుత ఆంగ్లవాచక నిర్మితవిధాన నైపుణీయము నా మనస్సున కెక్కినది—నా కుమారుఁడు పిల్లియైన నే నేమిగావలయు, నేను పెద్ద బావు

రుబిల్లి గావలయు, వాని పేరు పిల్లియైన నా పేరు గండుపిల్లి గావలయు. వాడు మ్యా వనిన నేను గుఱ్ఱనవలయు. వాడు రాత్రులం దెలుక బట్టిన నేను పగటియందే పందికొక్కులు బట్టవలయు. కృష్ణ! కృష్ణా!! యెంతటి కాలముప్రాప్తింప జేసితివిరా తండ్రీ! యేమో పాఠశాలకు బోయి చదువు నేర్చుకొని రానీ యని కుఱ్ఱవాండ్రను బంపినవారు పిల్లులగుటకును నెల నెలకు బడిజీతముల నిచ్చువారి తండ్రులు బొవురుబిల్లు లగుటకేనా! ఆహా! నాగరికత తలకెక్కెను? యెక్కెను. యెన్ని చేష్ట లుత్పన్న మగుచున్నవి. సర్వవేళలందు బాలుఁడు జూచుచున్న పిల్లికి మాటలాడు నేర్పు లేదని వారికి దెలియదా! పిల్లి చెప్పు మాట లివియనిన వాఁడు విశ్వసించునా! ఆ యుపాధ్యాయుఁడైనను బాలుఁడు పడుచుండిన తంటాలను జూచి అవి పిల్లి మాటలని భావింపవలయు నని చెప్పకూడదా! లేదే! యేదో మన కర్మ మింతవఱకు దిగినది. దినమున కొక పద్ధతి ఒకతీరు ఒకవిధము. నిన్న యుండిన పద్ధతియీ దినము లేదు. ఈ దినముండిన పద్ధతి రేపు లేదు. సంవత్సరమునకు 365 దినములైన బోధించుపద్ధతు లంతకన్న హెచ్చే. ఒక నాడు భవిష్యత్ జ్ఞానము దెలిసిన ఒక యేబదేండ్ల మహా మహుఁడు భార్యకు బంగారుగాజులు జేయించి వానిని చేతఁ బట్టుకొని పరుగెత్తుచుండగా నే నాతని కెదురుపడి యెందుల కయ్యా! యీ వయసునన అంత వేగముగ పరుగెత్తుచుంటివి అని నే నంటిని. అందుల కాతఁడు ఇది నా కర్మ—కాదు

కాదు—నా భార్యామణి యేడ్పు—ఊహూ అదియును గాదు—యీ కాలపు విశ్వకర్మల నేర్పు—నన్నిట్లు బరుగెత్త జేయుచున్నది. నేనీ గాజుల నింటికి దీసికొని పోవులోపల యే క్రొత్తరకపు గాజులు బయలు దేరునో నా యనుంగుసతి మరల ఆ రకమే గావలయునని యెచ్చట పట్టు బట్టునోయని పరుగెత్తుచుంటినని యతఁడు చెప్పెను. యాతని కర్మము. మనబిడ్డల ప్రారబ్ధము. రెండును యీ నాటి కొకటిగానే యున్నది యేమిజేయఁగలము. నాకు పసరుమహాత్మ్య విమోచనము గలిగిన తర్వాత నా యుపాధ్యాయునితో బోధనా పద్ధతిని గూర్చి యేమిటో మాట్లాడవలయు ననుకొని యచ్చటినుండి బయలుదేరి జయ పరమేశ్వరా! మూడవదీవి కన గనే రివ్వున మూడవదీవిఁ జేరితిని.

ఆ దీవిలోనున్న గృహములోనికి మునుప టిండ్లలోనికి జొచ్చినటుల నిరాటంకముగ వెళ్ళితిని. అచ్చట గూడ నొక యుపాధ్యాయుఁడు కొంతమంది బాలురకు బోధించుచుండెను. బడిపంతులు తనముందున్న మేజాపై రెండు గ్లాసుటంబ్లరును (దానికే ఆంగ్లమున బీకర్లని అంటారు లెండి) ప్రక్కన నీళ్లు గల గాజుపాత్రలను బెట్టుకొని బోధించుచుండెను. అతని మాటలను బట్టిచూడ ఆతఁడు తమిళదేశస్థుఁడై కడుపుకూటి కొఱ కాంధ్రపాఠశాలయందు పనిచేయుచు కక్కుర్తికొఱకు తనలో గ్రుక్కబడిన తెనుగుపదముల చిత్రవిచిత్రముగ అప్పుడప్పుడు తన వాక్ ప్రవాహమున దొర్లించుచుండెననుకొంటిని. ఆతఁడు బాలు రందరి కిట్లు బోధింపసాగెను.

ఉపాధ్యాయుడు:—ఓ పశంగళే

ఒక బాలుడు:—ఏమిసార్ ! మేము పశువులమా?

ఉపా:—ఆమా కూర్కోండి. నేను మీాకొక సిత్రం కాటుతాను కూడండ యీాయి రెండు కడదాసి (కాగితము) లలోను రెండువెళ్ల (తెల్ల) పదార్థంగళుండాయి కూడండ, అని యనగనే కూశనామండ యని ఒక బాలుఁడు ప్రత్యుత్తర మిచ్చెను. పిల్లలందరు తమ తోడివాని ప్రత్యుత్తరమునకు నవ్వసాగిరి. మరలాయుపాధ్యాయుఁడు అబ్బళారా శద్దుశే యద్దండ యింగెయుండాదే యీాయి రెండు గళాస్‌పాత్రలలో నీరముపోయుశున్నాను. నేనిప్పుడీ పాత్రలలో యేమివ్రూతి (పోసి) నాను శెప్పండఅనెను. అందుల కొక బాలుఁడు లేచి నీరము వ్రూతినారు అని బదులుచెప్పగా అంద రైక్యకంఠమున పకాలున నవ్విరి. అప్పుడా యాంధ్ర తమిళసమ్మిళిత సరసా గ్రేశురం డగు నా యుపాధ్యాయుఁడు చేతులు పైకెత్తి ఓ బాళులారా ! మీారు గురువుకు రొంబావిడేయము కూపళ్ళ నాంగళ్ (మేము) శరివే టప్పుడు మా మాష్టర్ళకు ఎవళ (ఎంత) భక్తి, ఎవళఔదార్యము, ఎవళతొండు (సేవ) శూపించే వాళ్ళము మీాకు బుద్ధి ళేనేళేదు, మీా రల్లారం (మీా రందరు) శానా గురుభక్తి నేర్చుకోవళ్ల తెరియుమా (తెలుసునా) యని ఒక చిన్న ఉపన్యాసమిచ్చి కృతార్థుఁడయిన టుల తల క్రిందికి వంచుకొనెను. (అప్పుడు నే నొక మూాల నుండి దినమున కొక యుపాధ్యాయుఁడు మారుచుండ గురు

భ క్తి బాలునకు పట్టువడుశెట్లు యని యంటిని) అచ్చట బాలురుదప్ప యెవరును కనపడమి యా యుపాధ్యాయుఁడు వారలలోనే నొక్క రట్లనియుండవచ్చునని తలచి మనపాటము కానిండ ఇంద ఒక్కజలములో యీ కడ దాసిలోని శక్కెర వేస్తూ యిరికిరేన్ (వున్నాను) మీరల్లారం యీ షోదన నెల్లా గమనించండ (శోధనగాదు శోకమని జెప్పిన బాగుండెడిది యని యనుకొంటిని) ఆహా ఎన్నా యద్భుతం అప్పదార్థంగళ్ జలములో దూరి ఎట్లా తెరియాదెపోచ్చో (తెలియకపో యినదో) నీరము దాణ్ణి మింగేషింది తెలిషిందా యని చెప్పి చక్కెర నీళ్ళు ఒక బాలుని నోటిలో బోసి యెప్పిడిరుకుదురా యీ జలము. అని యడుగ ఆ బాలుఁడు నవ్వుచు తియ్యగా నుంది సార్ యని చెప్పి కూర్చొండెను. మఱియొక బాలుని నోటిలో ఉప్పువేసిన నీళ్ళను బోసి ఆ నీళ్లు యెన్నారుశిగా వుంది యని యడెగెను. ఆ బాలుఁడు మిక్కలి యుప్పును నోటఁబట్టలేక తుబుక్కున నూఁచఁగా వాని సమీపమున నున్న బాలురకును యెదుట నిలిచియుండిన యుపాధ్యాయు నికిని యభిషేకము జరిగెను. ప్రకృతి సిద్ధమగు వస్తువుల కలరూపెఱింగించు టెంత వెఱ్ఱితనము. నాలుగేండ్ల బాలుఁడు సహితము వుప్పులేని కూర తిన నిచ్ఛగించనపుడు ఉప్పెక్కువ కూర యా కూరనముందిడిన వాఁడు వాని తల్లి వంకజూచి యమ్మా ! ఉప్పుదాత్తే యెత్తతినేదీకూరు యని నంగినంగిగ యేడ్చుచున్నప్పుడు—అనాదిగ లేకున్నను సాంగత్యదోషము

వలన నిత్యము త్రికాలముల దర్శనమిచ్చు కాఫీలోచక్కెర తక్కువైన రెండేండ్ల బాలుడు ఛుప్. ఛూ. నాకొద్దు, తీపి లేనే లేదే యని మూల్గుచున్నపుడు—ఇప్పుడీ యుపాధ్యాయుడు బోధించెడి పరమరహస్యమగు పంచాక్షరీ యెట్టిదో నేనెంత తల గోకికొనినను నా కర్థముకాలేదు. కూరలలో వేయు నుప్పు కరుగకనే మనమంతరము దంతతాడనముచే పొడిచేసికొని మ్రింగుచున్నామా! కాఫీలో వేసిన చక్కెర కరుగకనే నోటి లోని కట్టె యిసుకవలె వచ్చుచున్నదా! లేదే అనుదిన కార్యక్రమములలో ప్రతిబాలుడు వస్తుతత్వము దెలిసికొన వీలున్నప్పుడు ఈ నూతనకర్మ—ఈ నవీననాటకము—ఈ క్రొత్తనాట్య మేమిటో చదువరులే యూహింతురుగాక. అక్కటా! యిదేమికర్మము! ఈ యుపాధ్యాయుల బోధనా పద్ధతులకు మూలమేమో లేదే! కుక్కకు నిశ్చయముగ నాలుగు కాళ్లే నని యెవ్వరికిని దెలియని నిజమర్మము దెల్పి కృతార్థులగు వారు—ఆకుల కీనె లున్నవను పరమరహస్యము బోధించి బొందితో కైలాసము జేరువారు—మొలకలను వేర్లున్న ప్రక్కన నాటిననే బ్రతుకునను తారకమంత్ర ముపదేశించి మహాప్రవక్తల జేరువారు—విత్తుబూడ్చినగాని మొలక మొల వదను పరమక్రియ బోధించి పరమపావను లయినట్లు దలచు వారు—పక్షి రెక్కలతోనే నెగురుచున్నదను పరమార్థము వెడలఁబుచ్చి లోకోద్ధారకులగువారు—పిల్లి యెలుకలబట్టును—మంగలి గొరుగును—చాకలి గుడ్డలనుతుకును—ఆవు యంబా

యనును—కుక్క మొరుగును:—కోడి కొక్కొరకో యను
ను—కాకి కావు కావు మనును—పశువులు గడ్డినిమేయును—
వడ్లలో బియ్యముండును—అను నిత్యాదిపరమరహస్యము
బోధించు మహనీయు లభిప్రాయము లేమో నాకు దెలియుట
లేదు. మంగళ్ల చాకళ్ల వృత్తులు దెలుపుట కిన్ని యార్భాట
ము:లు—ఈ చిలుకపలుకులు—ఈ గోరువంక గొదగొదలు—
ఈ కోడి కొక్కరింపులు—ఈ పిల్లికూతలేలనో! ఈ వెఱ్ఱి
ఆంగ్ల ఆంధ్ర తమిళ సమ్మిళిత సన్నిపాతసారము గాబోలు.
యేమిజేయఁగలము! పుట్టిన బిడ్డకు దెలిసిన యీ విషయము
లను గూర్చి—గృహములో స్వయముగ నేర్చుకొనుచున్న
యీ విషయములను గూర్చి—ప్రతిదినము ప్రకృతిసిద్ధముగ
నేర్చుకొనుచున్న యీ విషయములను గూర్చి—యిన్ని
ముప్పతిప్పలు—యిన్ని వంకరతిరుగుడులు—యిన్ని చిప్ప
కట్టెశాస్త్రములు—యిన్ని తలతిక్కవ్యవహారములు—యిన్ని
బల్లిపలుకు లెందులకు! వహవ్వా—సెబాష్—విద్యనేర్చిన
నీవు నేర్వవలె, నేర్చిన మేము నేరువవలె! ఔరా కాలమ
హిమ! మరల మరల మాకీ విషయము లిక వద్దో రామ
చంద్రా, యనుచుండ మీరు వినక తప్పదంద్రో, యని వాగు
చేల! దీని యభిప్రాయమేమో తత్వమేమో తెలియుటలేదు.
సరిగదా యీ కర్మ మనల నెంతవఱకు చుట్టిముట్టియుండునో
యా ఈశ్వరుఁడే దెలియక తికమకపడుచుండ నిక మన మెంత
టివారము! ఈ దిన మెవరిముఖము జూచితినిరా పరమేశ్వరా

యొచ్చుటకుబోయిన నీ దివ్యదర్శనముతే దాపరించుచున్నవని చెలో మహేశ్వరా మఱియొక దీక్షకి అనుకొంటిని. యథా ప్రకారము నేనా దీవిలోనున్న గృహముఁ జేరితిని. బోర్డుపైన పెద్ద యక్షరములతో (Geography) భూగోళమని వ్రాయ బడియుండెను. నే నచ్చటికి బోవునరికి యచ్చటనున్న యుపాధ్యాయుఁడు తా నిదివఱకు బోధించిన విషయముల బాలురు గ్రహించిరో లేదో దెలిసికొనుటకుఁ గాబోలు యీ క్రిందివిధముగా ప్రశ్నించుచుండెను.

ఉపా:—కృష్ణా! చంద్రగ్రహణ మెట్లు గలుగు చున్నదో జెప్పుము.

కృష్ణుడు :—సూర్యునికి వెలక పండడ్డమువచ్చి, కాదు మాష్టర్, దీపమునకు వెలక పండడ్డమువచ్చి దాని నీడ గోలిపై బడినపుడు, కాదు, కాదండీ సార్ మఱచినాను. సూర్యుఁడనే దీపమెదురుగ నున్న భూమనే వెలగపండునీడ చంద్రుడనే గోలిపై బడినప్పుడు చంద్రగ్రహణ మనుకొనవల యును.

ఉపా:—ఓరే! నీ పిండకూడు, మండిపోను సూర్యుఁడనే దీపము, భూమనే వెలగపండు, చంద్రుఁడనే గోలీయే మిరా! అనే, అనే, పిండము వదలిపెట్టి భూమి నీడ చంద్రు నిపై బడినప్పుడు చంద్రగ్రహణ మనబడునని చెప్పుము.

కృష్ణ:—అదికాదుసార్. మీరు దీపాన్ని సూర్యుఁ డని, వెలగపండును భూమని, గోలీని చంద్రుఁడని చూపలేదా సార్.

ఉపా:—బుద్ధిలేని పశువా! నోరుమూాయి. ఇస్కూళ్ళ యినస్పెక్టరు వచ్చినప్పుడు నేను చెప్పినట్లు చెప్పక నీ విప్పుడు వదరినట్లు వదరినావంటే నీ బుఱ్ఱ పగలేస్తాను జాగ్రత్త. రంగా! పగలు రాత్రి యెట్లు కలుగుచున్నవో చెప్పుము.

రంగ:—గాలికొట్టినపుడు దీప మారకుండా దాని కాంతి భూమిపై పడితే ఆ కాంతిపడిన భాగము పగలనియు, నీడగనున్నచోటు రాత్రియనియు తెలువవలయును.

ఉపా:—గాలికొట్టినపుడు దీప మారిపోవు టేమిరా నీ శ్రాద్ధము!

రంగ:—నాకు శ్రాద్ధములేదండీ, మా తాతకు పెడ్తా రండీ అప్పుడప్పుడు. మీరు రాత్రి పగలునుగూర్చి బోధించునపుడు దీపము గాలికి ఆరిపోలేదా సార్. అప్పుడొకప్రక్క భూమనే వెలకపండుపై యెక్కడ దీపపుకాంతి బడిందిసార్.

ఉ:—ఆ రామాయణమంతా నీకెందుకురా, సూర్యుని కాంతి భూమిపై బడినచోటు పగలనియు నీడగానున్నచోటు రాత్రియనియు నేను చెప్పలేదా!

రంగ:—ఇంకమీాద అట్లే చెప్పుతానులెండి సార్.

ఉ:—రామా! భూమి గుండ్రముగా నున్నదనుట కొక సూత్రము చెప్పుము.

రామ:—మన మొక చీమను ఆరంజిపండు మీాద విడచిన మరలనదేచోటికే ఆ చీమ ఆ పండును చుట్టివచ్చునట కాబట్టి భూమి గుండ్రముగా నున్నదట.

ఉః—నటు, ఏమిరా! న త్తివెధవా! ఆ దినము చీమ పండును చుట్టివచ్చుట నీవు చూడలేదటరా!

రాః—ఔనుసార్, చూ స్తిని. అయితే సొట్టగా పోవు యాచీమను మీరెన్నిమాట్లు పట్టివిడచినను పండుపై గు ర్తుకు పెట్టిన సిరాచుక్క యున్నచోటి కది రానేలేదండి.

ఉః—అదంతయు నీ కెందుకురా! ఊరక వాగకుము మఱియొక కారణ మేమైన జెప్పగలవా?

రాః—ఆ! చెప్పగలనండీ! మీరు బోర్డుపైన వలయా కారముగా గీచి యిది భూమియని వ్రాయుచుందురు. కావున భూమి గుండ్రముగా నున్నదనుటకు యదిగూడ నొక కారణ మండీ!

ఉః—ఆ కారణము మన కక్కరలేదు గాని మీరం దరు యిటుచూడండి యీ దినము మీ కొక క్రొ త్తవిష యము నేర్పెదను. (అని బోర్డునందు వలయాకారముగ గీచి దానిమధ్య ఒకగీత గీసెను) మరల బాలురవంకకు తిరిగి "బాలులారా! చూచితిరా! గుండ్రముగనున్న భూమికి మధ్యనున్న నిలువుగీత యిరుసువలె నున్నది యని యనుట తోడనే ఒక బాలుడు లేచి "ఆయిరుసున కెటువంటి కందెన వేస్తారండీ" యని యడుగగా ఛీ కూర్చొనుము అట్టి ప్రశ్నల వేయకుము అని ఆ యుపాధ్యాయుడు మరల తన పాఠమును బోధించుటకు ప్రారంభించెను. ఔరా! ఇతడపరబ్రహ్మగా నున్నాడురా నాయనా. ఈతనిప్రశ్నలు, బోధించుపద్ధతులు

చూస్తే యింతటి మహాశయుఁడిక పుట్టబోఁడని తలచుకుంటూ యీ పనికిమాలిన పద్ధతులు జూచి విసుగెత్తడముచే అచ్చట నుండి మఱియొక దీవిఁ జేరితిని. ఆ దీవిని చూచుకొని యింటికిబోవు టుత్తమమనుకొని యాదీవిలోని పాఠశాలలోనికిఁ బోతిని. అచ్చటుపాధ్యాయుఁడు బాలుర నిర్దిష్టించి మీ యుపవాచకములోని ఏదునాల్గవ పేజీని తెరువుఁడని జెప్పి తానిట్లు జదువఁదొడగెను. "అభిజాత్యమునందు గణికయయ్యు గుణగణంబుచే మాననీయ యగు కమలాదేవి యను కన్యకామణి ఆ కామధేనోత్సవమునకు వచ్చెను. ఆరోవెలంది హావభావంబుల నెఱింగి యా రసిక శిఖామణియు నామెయం దనురాగియయ్యె గాని విత్తశూన్యుండగుటచే యామె సాంగత్యం బలభ్యంబని నిరాశతో నింటికిఁ బోయెను" అట్లాతఁడు కొంతవఱకు జదువగనే నాకెచ్చటలేని విసుగెత్తినది. బాలురు సాధారణముగ గురునిసాహాయ్యము లేకనే జదివి యర్థము జేసికొనవలసిన విషయ మింత కఠినముగను మోహజనకముగను వ్రాసిన గ్రంథకర్త బాలురకని వ్రాసెనో లేక ఉపాధ్యాయుఁడా కవితా మాధుర్యరసములో మునిగి నాని తేలుటకు వ్రాసెనో లేక తనకే వ్రాసుకొనెనో నాకు తెలియలేదు. అవునులెండి. కాల మట్లు మారిపోయినది. అంగడికొరకు వ్రాసిన పుస్తకములలోని నీతి—నారికేళపాకపుధోరణి జూప వ్రాసిన కవివర్యులకథలలోని నీతి—నిజముగుకథ నొకవంకలో ద్రొబ్బించు యతిశయోక్తులచే గాగితముల నింపిన కథలలోని

నీతి—కవితామృతమున మునిగి లేవజాలక కథాబీజమునే మఱచి వ్రాసిన త్రైతక్కకథలలోని నీతి—ఒక్కటిజూచి మఱి యొకటి యనుకొని వ్రాయునవు డింకొకటి వ్రాసిన కథల లోని నీతి—భావము లేమేటగలియనీ యతిప్రాసలపై గమన ముంచి దేవులాడిన కథలలోని నీతి—కొంతవఱకు వ్రాసి కట్టకడపట కథల నెట్లెల్లవలయునో తెలియక పుస్తకము ముగింపవలయు నను తహతహచే నెట్లో యొకరీతి వ్రాసి ముగించిన కథలలోని నీతి—వివిధవర్ణనలతో బుస్తకమంతేయు నిండించి ఒకరాజకుమారుని వివాహము బూర్తి జేయుటలో పుస్తకమును గూడ పూర్తిచేసి ముగించిన కథలలోని నీతి—యేమి యుద్దేశము లేకనే వివిధవిధములుగ యిచ్చవచ్చి నటుల వ్రాసిన కల్పనాకథలలోని నీతి—పదిపుస్తకములుజూచి దానిలోఁగొంతదీనిలోగొంతగ్రహించియతుకులయంగరఖావలె నిలువబెట్టిన కథలలోని నీతి—మనల, మనపాపల, మనస్త్రీల నుట్టికే యెక్కించునో—స్వర్గమునకే సోపానములుబెట్టునో—పాతాళమునకే ద్రొల్లించునో—వారి వారి యనుభవమున వారి వారికి తెలియుచునే యున్నదిగదా! ఇకచాలు నీ దీవుల పర్యటన మనుకొని పసురుమహాత్మ్యమున మరల సముద్రతీరము జేరి నే నిదివఱకు జూచిన విషయముల నెల్లదలచుకొనుచు, జుయ్యిమని యీగలు ముసురుచున్న పదార్థములఁ గొని తిను నుపాధ్యాయుఁడు ఆరోగ్యమునుగూర్చి బోధింపఁ జేయుచున్న కాలమా నీ కొక వందనము—తమిళునిచే ఆంధ్రము బోధిం

పఁబడు కాలమా నీ కొక వందనము—చిక్కి శల్యమై లేవ లేని స్థితియందుండు బొక్కినోటి యాతఁడు "అతెన్షన్" (Attention) యని వ్యాయామము (Drill) నేర్పు కాలమా నీకొక వందనము—యవినీతిపరులచే నీతిని బోధింపఁజేయు కాలమా నీకొక వందనము—బాలుర యభివృద్ధి యేటిలో గలిపి జీతమునకు దినములు లెక్కించుకొనజేయు కాలమా నీకొకవందనము—జీవితాధారములగు ముఖ్యమగు విషయ ముల విడచి పనికిరాని విషయములనే మరల మరల బోధిం పఁజేయు కాలమా నీకొక వందనమని నాలో నేననుకొనుచుఁ బోవుచుంటిని. ఎండవేడిమిచే శరీరమంతయు జమటచే నాని పోవుచుండెను. అట్టిసమయమున ఒకసాహెబు నా కెదురుగ వచ్చెను. పసురుమహాత్యగర్వముచే ఆతని నేడ్పింప నిచ్ఛగించి అతని కగుపడననుకొని చెవియొద్దకు బోయి, క్యా! బాబా నీకి యెంతా మంది బిడ్డల్, యెంతా మంది భార్యల్, యెం తామంది అక్కల్, యెంతామంది అన్నల్, యని చెవులు గింగురుమను నట్లఱచితిని. అతఁడును నా చెవిగూబ గుయ్యి మని నదరునట్లు ఒకదెబ్బ యిచ్చి యేమిరా! సైతాన్ పడి నట్లు మీాదపడ్తావ్, నాకీ యెంతామంది బిడ్డల్, బీబీల్ వుంటే నీకి క్యాఫాయిదారే, హైవాన్! యని యింకను లొడ లొడ తిట్టుచు నాచేయి పట్టుకొనెను. ఆ దెబ్బతో నాకు పసురు వలన గలిగిన గర్వమంతయు మాయమయ్యెను. చెమటలో పసురు కొట్టుకొనిపోయి యుండును గావున నేనిప్పు డందరి

కగపడుచుంటినని తెలిసికొని నేనుజేసిన తప్పు మన్నింపుమని ఆ సాహేబుగారిని దాడీబట్టుకొని బ్రతిమాలి యా యమునిపట్టు నుండి విడివడి బ్రతుకు జీవుఁడా యని యింటికివచ్చి చేరునప్పటికి తలప్రాణము తోకకు వచ్చెను.

---

## ౬

## మగవారి బుద్ధి

మా యూరికి మూఁడుమైళ్ళ దూరమున నున్న మదన కళామందిరమున భారత మహిళాసంఘ కార్యదర్శినిగా రగు శ్రీ శ్రీ మాలతీదేవిగారిచే "మగవారి బుద్ధి" యను విషయమును గూర్చి విపులముగ—ఉపమానయుక్తముగ—రసవంతముగ—సాహిత్యయుతముగ — అభినయపూర్వకముగ—సర్వజనానురంజకముగ—వెయ్యేల పురుషుల తలలఁ ద్రొక్కినట్లుగ—కాదు కాదు, తలయెత్తుకొని దిరుగకుండునట్లుగ 4 గంటల 15 నిమిషములకు నుపన్యసించెదరని విని నే నచ్చటికి బోవ సంకల్పించుకొని త్రోవన నిలువఁబడియుండు ఒకసాహెబుయొక్క గుఱ్ఱపుబండిలోఁ గూర్చుని, "పోనిమ్ము మదనా కళామందిరమునకు" నని యంటిని. అందుల కాతఁడు క్యా సామీ మదన్ కల్లెము కెగర్ కి చార్ అనా దేనా, అచ్చాగోడా షామి, ఈ దినమే 120 యెండీబిళ్ళల్ షోసికొంటిన్, అమ్ము

తడాఖా దేకో తంతిపోయినట్లు పోవాలె అనివదరుచుండు నాతనినిజూచి సరే పోనిమ్మని తలయూపితిని. అతఁడును బండి లోఁ గూర్చొని బండిని దోలెను. గుఱ్ఱము సాహెబుచెప్పి నట్లు విశేష వేగముగ కొంతదూరము పోయి ఒక మైదాన మున నిలిచిపోయెను. సాహెబు దానిని చెల్ ! చెలో ! ! బేటా యని కొరడాతో ఒక దెబ్బ తీసెడివేళకె ఆ గుఱ్ఱము వలయాకారముగ ఆ మైదానమును చుట్టుట కారంభించెను. పాపమా దాఢీసారథి యెంత కళ్ళెముబిగియఁబట్టినను గానుగకుఁ గట్టిన యెద్దువలె చుట్టుటమానలేదు. బండిలోఁ గూర్చొ నియుండిన నాకు రంకులరాట్నములో గూర్చొన్న నూతన బాలునికివలె కన్నులు దిరుగఁ జొచ్చెను. ఈ యదృష్ట తదృశ్యమును జూచుచు చాలమంది నవ్వఁదొడఁగిరేగాని, యెవరును గుఱ్ఱమును నిలుపఁ బ్రయత్నించలేదు, సరిగదా యింకను నవ్వుటకును, చప్పటలు జరచుటకు నారం భించిరి. మా సాహెబు మాత్రము, పకడో ! పకడో ! ! పకడో ! ! ! అని యఱచుచుండెను. గాని గుఱ్ఱము మాత్రము గ్రామఫోనులోని తట్టవలె తిరుగుచుండెను. ఇంతలో నల్లని సూటును ధరించినవాఁ డొకఁడు అతని పుణ్యామాయని జన సమూహమునుండి కొంచెము ముందునకు వచ్చెను. వానిని జూచినదే మా గానుగ గుఱ్ఱము ముందటి రెండుకాళ్ళను పై కెత్తి చెంగున పైకి లేచెను. యంతటితో బండి పైకి లేచు టచే నేను నట్టనిజాటి క్రిందఁబడి లేవబోవుసరికే సాహెబు

గారు గూడా పీపావలె దొర్లుకొనుచు వచ్చి నా మీఁదఁబడెను. చేయునదిలేక మెల్లగ లేచి బండిదోలువానితో "నీ గుఱ్ఱమున కేమి తెగులు, సారాయి యేమైనా త్రావించితివా యని యడిగితిని." అందులకా ముసల్మాను వెక్కి వెక్కి యేడ్చుచు హల్లా! హల్లా! ఎంత మోసము చేసినాఁడు, సామి! ఇప్పుడు నాకి అర్థము తగిలింది. ఇది గోడా సర్కసు వాఁడు మోసముచేసి నాకు అమ్మివుండాఁడు. మైదానము సూసి గిర గిర శక్రము తిరగల అట్లా తిరిగింది. నల్లగుడ్డల్ యేసికొని దొరా వచ్చే వేళకు సర్కసులో కాళ్ళు పైకెత్తి నట్లు నిలిచిందిరా దేవుఁడా! ఇంక అమెక్యాకర్నా! నాది బిడ్డల్, పాపల్ అందరు సాప్ సీదా, యెంతాడబ్బు, యెంతాధనం, యెంతారొక్కము తల్సూకొంటే పానము పోతాయి, అని యింకను యేమేమో వదరుచు యేడ్చుచుండెను గాని నాకు మాలతీదేవి గారి యుపన్యాసము వినవలెనని కుతూహల ముండుటచే వాని యేడ్పును జూడకయే పరుగు పరగున మదనాకళామందిరమును జేరితిని. అచ్చట స్త్రీపురుషులు భేదములేక గూర్చొనియుండిరి. మాలతీదేవిగారు నల్లనితీగవలె సన్నగనే యుండి తన నామ ధేయమునకు సార్థకముగనె వుండెను. ఆమె ముందరి మూడు పండ్లు పెదవులనుమించి స్థిరముగ సిగ్గుబిడియములు లేక యం దరికి యగుపడుచునే యుండెను. యామె మన కవుల వర్ణనలోని కమలనయన గాకున్నను దివాంధనయన మాత్రము గాకపోలేదు. ఆమె నిజముగ పూర్వసువాసినియో లేక పళ్ళి

మనువాసినీ వేషధారణియో చెప్పుటకు వలనుపడదు. మిట్ట నొసలు, బొప్పిచెవులు, పొట్టివేణి, ఊసచేతులు, ఇంతయేల యామె చీరగట్టిన దోసముచే యామెను స్త్రీ యనిన పుణ్యమున బోవలెను గాని, లేకున్న మాలతీదేవి బోడిమీసపు పేడిపురుషులలో నొకరుగ భావించవలసియుండునేమో, ఆమె నేను బోకముందు యేమిమాట్లాడెనో గాని నేను బోవుసరికి యీ విధముగఁ జెప్పుచుండుట వింటిని.

......... తెలిసినదా, యిప్పటికైన దెలిసినదా! మగవానిమనస్సెంత పేలపిండియో, యెంత జొన్న బొరుగులో—జీలుగ బెండులో—తుక్కు పేలికలో దెలిసినదా! ఏమట్లు తలలువంచుకొంటిరి. ఈ విశాలప్రపంచమనెడి నాటకశాలలో మీ రెట్టి పాత్రల ధరించియుంటిరో మనస్సున కేర్పడినదా, (Henpecked పాత్ర యని యొక మూలనుండి మూలలుగు) మూలసూత్రధారుఁడగు నా స్వామట్టు మిమ్ములఁజూచి యెటుల నవ్వుచున్నాఁడో కనుగొంటిరా, యెప్పుడైన, యేసమయమునకైన, కలలోనైన మేము మా అక్కచెల్లెండ్లతో వైరము బెంచుకొని, రామ రావణయుద్ధములు జేసికొని బ్రతికితిమా—లేదే—యెవరెన్ని జెప్పినను—నెత్తిన నోరు బెట్టి కొట్టుకొనినను—ఊహూ చచ్చి పిడికెఁడు దుమ్మయినను—మేము మా చెవులలో వేసికొంటిమా—మాఅన్యోన్యైక్యశ్చెడినదా—మేమే యిట్లున్నప్పుడు—మీకు తలవంపులు గలుగునట్లు న్యాయాన్యాయములు దెలిసికొనుచున్న

ప్పుడు, మీ రెట్లుండవలెనో గ్రహింపఁబని లేదా—ముందు వెనకలు యోచింపనక్కరయే లేదా—సత్యాసత్యములు గమనించవలసిన ప్రమేయము లేదా— నీ భార్య నీ ముందు గూర్చుండి "నీ సహోదరుని ముందు బ్రతుకలేను సుమండీ, ఏమి ఖర్చు యేమి యాగడము జరుగుచున్నది, మనయింటిలో కాబట్టి సరిపోవుచున్నది గాని, మా అత్తగారిపోరు బడలేనండీ" అని యామె అనినంతనే అంతటితో సరి. నీ భార్య కటాక్షవీక్షణమునకై—తళుక్ మని మెఱసి ఒక్క నిమిషములో మాయమగు క్రీగంటిజూపునకై—త్రుటి కాలపు హీ—హీ—హీ యను సకిలింపులకొఱకై—తుచ్ఛమగు నొక వెంగలి యికిలింపుకొఱకై—[illegible]తీ హృదయానందముకొఱకై—యామెకు కలుగ[illegible]కై—నీవుబడుపాట్లు యింతింత యని జెప్ప[illegible]—[illegible] నిమిషమునుండి నీతలకు కై పెక్కించుకొనుచున్నావు యామత్తు మహాత్త్వముచే మంచిదేదో చెడ్డదేదో—న్యాయమగునదేదో యన్యాయమైనదేదో—దగ్గరదేదో దూరము దేదో—ప్రాతదేదో క్రొత్తదేదో దెలియక నీ జననీజనకులను విషతుల్యులుగఁ జూచుచున్నావు. నీ భార్య గొంచ మజ్ఞానములోఁ బడినప్పుడు మంచి మార్గమునకుఁ ద్రిప్పుటకు బదులు నీసహోదరుల శత్రువులుగఁ దలచుచున్నావు. నిన్ను పెంచి పెంపొందఁజేసిన దండ్రిపై—ఒకే గర్భమునుండి బయలువెడలి ఒకేచోట యాటపాటలునాడి యానందించిన సహోదరునిపై చిదుముడి పడుచున్నావు—

కోడిపుంజువలె మెడను జాచుచున్నావు—సాముఁ జేసినవాని వలె వస్త్రమును పైకెగగట్టుచున్నావు—నీవే యాధారమని—నీవే సమస్తమని—నిన్నింతవానిగఁ జేసినందుకు నీవేమో కిరీటము బెట్టెదవని, నీవేమో వారినట్టె కైలాసమున కెక్కించెదవని, నమ్ముకొనియున్న వారిని బైటికి గెంటివేయుచున్నావు, పిడుగువంటి మాటలచే నొప్పించుచున్నావు—కూలివానికివలె సోలెడు బియ్యమిచ్చుట కేడ్చుచున్నావు—పినతల్లివలె పోషించుచున్నావు—గృహములందు కొన్నిలోపములుండక పోవు అట్టిలోపములు భరించలేక నీ సతి నీయండఁజేరి చెప్పుకొనుచున్నప్పుడు (సిగ్గుసిగ్గు—చెప్పుచున్నప్పుడు అనకుడు బెదరించుచున్నప్పుడు అని చెప్పుడు యని ఒకస్థూలకాయుఁడఱచెను) వాస్తవమేనయ్యా, తాము జెప్పినదికూడ గమనింపక తప్పునా అట్లె బాధించె ననుకొనుము. అంతమాత్రము నీవట్లు చేయి గాలినకోతివలె గావలయునా, నవమాసములు శిశువునుభరించు స్త్రీకి ఓర్పా, కాసంత బెదరింపునకు తెలివితక్కువపనులఁ జేయు పురుషునికి ఓర్పా, నీవు హేయము గుపనుల నెన్నిటినో జేసి జీవితపర్యంతము బెట్టు కస్త్రీకి లోలోన యేడ్చుచుండు కోమలిది ఓర్పా, కాసంత మూతి త్రిప్పునకే గగ్గోలుపడు పురుషున కోర్పా—జెప్పుము—నీవే జెప్పుము—మగవాఁడని—నీకన్న మించినవారు లేరని—జితేంద్రియుఁడని—ఆడది హేయమని, తుక్కని దుమారమని వదురుచుందువే యేదీ? మగవానికిఁగల గురుతరబుద్ధి యేది,

(మగవాఁడనుట రూపభేధము నిర్దిష్టించునామమే గాని ఆడ దానిచేతి కీలుబొమ్మసుమా యని యొక చిగురుబోఁడి తన భర్తవంకఁ గాబోలు క్రీగంటఁజూచి పెదవు లబ్బి బిగించి నగుచు అరచెను) ఆ మాటలలో దోసమున్నదని నే నను కొనను. నూతనముగ వచ్చిన నాతి మాటలోని రుచి యనా దిగ నిన్ను బెంచుచుండిన నాయనగారి మాటలలో గనపడ లేదా—క్రొత్తగవచ్చిన కోమలి మాటలలోని కోమలత్వము కనిపెంచిన కన్నతల్లి పలుకులో కనుగొనకపోతివా—మొన్న వచ్చిన ముదితమాటలలోని మాధుర్యము మాననీయుఁడైన మిత్రుని మృదూక్తులలో దొఱకలేదనుకొంటివా—సుకుమారి యగు సతీరహస్యామృతము సహోదరుని పలుకులలోఁ దెలు సుకొనలేకపోతివా—ఆహాహా! దలఁచుకొన్న సిగ్గగుచున్నది. మా జాతివారు మీ మాటల నెప్పుడైన చెవిలో వేసికొ నిరా, యుక్తాయుక్తజ్ఞాన మఱయక నే కుటుంబములు నాశము గావించుకొనిరా, ఇప్పుడైన జెప్పుము. నీ వెంతటి యజ్ఞాన సముద్రములో మునిఁగి గొట్టుకొనిపోవుచున్నావో జూచి నిన్నుద్ధరించుటకై—నిన్నట్టి పైకి లేవనెత్తుటకై—నిన్ను మగవాఁడని యనిపింపఁజేయుట కొఱకై—మా స్త్రీజనం బులు నిన్ను జూచి హి హి హీ యని నవ్వకుండుటకొఱకై (కాదు తల్లీ! కాదు అదియునుకాదు క్రోధఘూర్ణితాయుత నేత్రియగు కోమలి చరణాఘాతమునుండి దప్పించుకొనుట కొఱకై యని ఒక మూలనుండి శబ్దము) నే నిన్నివిధములు

మీకుఁ జెప్పుచుంటిని గాని మా సోదరీమణులు జేయు చేతలు చెడ్డవనిగాదు. (అవును మఱి మీ వృత్తిమీఁగగౌరవపఱచు కొందురా యని యఱవు) నాయనా మీ అప్పచెల్లెండ్రు జేయుచుండు దుఃఖకరమగు పనుల నే నెఱుగకపోలేదు. కాని వారిని భరించువారగు మీరే వారు చెప్పుచేఁతలలో—వారి జిహ్వాగ్రములో—వారి క్రీగంటిచూపుకొసలో—వారి చూపుడు వ్రేలినఖాగ్రములో—వారి తలయూపులో మీరు జేరుకొనుచుండుట యేమంతసమంజసము—మా స్త్రీజాతివిషయమున గల లోపము నింకొకసారి జెప్పెదను. ఇప్పుడు మీలో గల యవిక తవకపువిషయముల నే ముచ్చటింపఁదలఁచుటచే వానిని గూర్చి మాత్రమే మాట్లాడుచుంటిని. వినుఁడు. కొంచె మోపికతో వినుఁడు. మీ పరస్త్రీ వాంఛాలాలసమానస మెుకింత యావలకుఁ ద్రోసి వినుఁడు. ఇట్లగుటకు—ఇట్లు తలతిక్కవ్యవహారములు జేయుటకు—ఇట్లు మెదడు స్వాధీనములో లేకుండఁ జేసికొనుటకు—మూలకారణమేదో దెలసికొంటిరా, మీకుఁదెలసికొనవలయునని బుద్ధిబుట్టిన గదా! దీనికంతకును ఒకటే మూలకారణము—దీని కంతకును ఒకటే తల్లివేరు—దీని కంతకును నొకటే సూత్రము (అదేదని కేక) అదియా, మోహము, స్త్రీని జూచినంతనే మీ నరములల్లెట్టె విద్యుచ్ఛక్తి స్పర్శాచలితములగునట్లు జేసికొనుచున్నారే—నిలువున కొయ్యయయిపోవుచున్నారే "ఉ॥ స్నాయువసావసేక మలినమ్మగు నెమ్మొ గ్రహించి జాగిలం బాయత

మోదమందుఁ జనదాకలిదానికి" యను నార్యోక్తి, నిజము చేయుచున్నారే, నిరంతరము నారాయణస్మరణఁ జేయవలసిన నాలుక సదా సతీజపమంత్ర ముచ్చరించుటకై నదా! పలు మాఱు పద్మాక్షుని చింతింపవలసిన హృదయకమలము, లోలాక్షిని ధ్యానించుటకే యైనదా,—ముమ్మాఱు మాధవుని మననము చేయవలసిన మనస్సునకు మగువనే భజించుటకై నదా! రండు,—మీరు ప్రస్తుతమున్నచోటున నుండి ఒక మెట్టుపైకి రండు! మీ కన్నులయెదుట మృగము లెట్లు నడచుకొనుచున్నవి. వత్సరమున కొకతూరి యా ఋతుదినములందుఁ దప్ప మిగిలిన సమయములందవి యేమైన తమ సతుల పరిష్వంగసుఖముఁ గోరుచున్నవా. ఆ మృగములే యట్లున్నప్పుడు మీ రెట్లుండవలయునో యోజించితిరా! పాపము మీకు యోజించునంతటి శక్తి యెక్కడిది. కుటుంబములు నాశనముగానీ, ప్రపంచము పాతాళములో గలసిపోనీ, లోకమంతయు వ్రేలుచూపి వెక్కిరింపనీ దానితో నీకు పనిలేదు గదా! నీకుఁ గావలసినది నిరంతరము కామినీ కృపాకటాక్ష వీక్షణమేనా, నీకుఁ గావలసినది సదా సతీసంగమాభిలాషయేనా, నీకుఁ గావలసినది సర్వకాల సర్వావస్థలందును శోమలీహాస మొక్కటేనా! ఇంకొకవిషయము చెప్పెదను వినుఁడు. నీకుఁగల స్త్రీవాంఛ యెంతవఱకున్నదో చెప్పెదను వినుఁడు. రైలులో ప్రయాణముచేయుచున్నప్పుడు దూరముగఁ గూర్చొనియున్న యొక పరకాంత నట్టె గూబవలె, సన్మోహన

మంత్రకారునివలె కనురెప్ప వేయక చూచుచుందువే, ఆమె దేనికైనను నీవున్న ప్రక్కనఁ జూచిన ఆమె మన్మథావతార పురుషశిఖామణి యగు నిన్నే యామె చూచుచుండెనని భావించి యింకను కొంచెము ముందునకు జరిగి మెడను ముందుకుచాచి మీసములు మెలివైచి క్రాపింగులోని వెంట్రుకలను సరిచేసికొని నిక్కి నిక్కి చూచుచుందువే, కడకు ఆమె చూచినది నీ వెనుకప్రక్క పలక కంటించిన "దొంగలున్నారు జాగ్రత్త" యను నోటీసేగాని నీయేబ్రాసిముఖము గాదని దెలిసికొని నీ యబ్బసొమ్ము పోయినవానివలె నీవు లోలోన నెంత కుమిలి కుమిలి యేడ్చితివో యా దేవునికే యెఱుకగదా, ఆహాహా! నీవు పలుమాఱు చూచుచుండుట ఆమె గ్రహించియే యున్నయెడల ఆ సమయముననే "దొంగలున్నారు జాగ్రత్త" యను నోటీసులోని వాక్యమామె హృదయమున కెంత యమృతోపమానముగ నుండునోకదా! నేనొక చిన్నవిషయము మనవిచేసికొందును. మా సహోదరుఁడొకతూరి మద్రాసులో చెలారామ్‌షాప్‌నందు నిలువఁబెట్టియుండు కొయ్యబొమ్మవంటి దొకటి వెలకుఁదీసికొని దానికొక రంగుచీరనుగట్టి మాయూరికిఁ దీసికొని వచ్చుటకై రైలులో తనప్రక్క నా బొమ్మను బెట్టుకొనెను. ఇంతలో ఒక యువకుఁడు మీసములు ద్రిప్పుచు కన్నులఁ ద్రిప్పుచు పరాయిలోని ప్రక్క జోబీలలోఁ జేతులువైచుకొని కుంయి, కుంయి మని కూనురాగముఁ దీయుచు ఆ పెట్టెముందు ఇటునటు

పది పండ్రెండు మార్లు దిరుగుచుఁ గ్రీగంటను బొమ్మనుజూ చుచు, చిరునగవు నగుచు తుద కది కాంతగాక కొయ్యబొమ్మ యని ముఖ మట్టె వ్రేలవైచుకొని రివ్వునఁ బోయినాఁడు. (సిగ్గుసిగ్గు అని కేకలు) ముక్కు మొగ మెఱుఁగని నిన్నెం దుల కామె చూచునని భావింపఁబనిలేదా! చూచె బో ఆచూ పువలన నీకుఁ గలిగిన లాభ మెద్ది? దేనినిజూచి యామె యొక త్రుటిలో నీకై వశమగునని తలఁచుచున్నావు. తూ! తూ!! తూ!!! నీ వెంత పాపపు హృదయముతో—నసహ్యమగు కన్ను లతో—సహింపరాని భావనాపరంపరలతోఁ దిరుగుచుంటివి. చీర గట్టగలిగిన దేదైన సరే—చీవురుగట్టగలిగిన దేదైన సరే—చీకిపేలికఁ దగిలించిన దేదైనసరే—చూచినంతనే నీ కదేమి పోగాలమోగాని యుక్తాయుక్తజ్ఞాన మఱియకయే ఒకటే చూపుగదా, నీ కట్టిజూపులు వలన గలిగిన లాభమేమి యా చూపులువలన నీవు పొందిన మోహోపశమన మేమో, యా వెఱ్ఱిచూపులవలన కలిగినముక్తి యేమో, గాని యని యింకను యేమెూ చెప్పఁబోవుచుండ ఒక నల్లని బక్క పాటి పలుచని స్త్రీ యనఁదగిన ఒక వితంతువు గాఁబోలు ముసి ముసి నగవు నగుచు శ్రీ మాలతీదేవిగారికి ఒక కాగి తపుయుండ నందిచ్చి దీనిని (Paper Ball) యెవ్వరో నా పైన విసరివేసినారమ్మా అని అనెను. మాలతీదేవిగారు దానిని విప్పి ఇట్లు జదివెను......విన్నపములు. నేనీ జగమున నెవరికిని లోఁబడినవాఁడనుగాను. మా యింటి ప్రక్కనుండిన

నొక అధికారి నట్టేడు చెఱువులనీరు ద్రావించినాను. ఇరువది సంవత్సరములు సాముచేసి కాయవాటు శరీరముఁ గలిగిన ఒకసాహెబును మూడుపోర్లులు బొరలించినాను. నన్నుజూచి నవ్విన ఒకశెట్టిని యెముకలు విఱుగఁగొట్టినాను. కాని నిన్ను జూచినదిమొదలు నా మనస్సు మారిపోయినది. నీ పాదములుబట్టి ప్రార్థింతును. నీకు సేవకుఁడనగుదును. నీవు కాలితోఁజెప్పినది జేతితో కాదు కాదు యెంతటిమాట, వీలుగనున్న తలతోఁ జేయుదును. నాకు సౌందర్యమున లోటు లేదు. కాని గిట్టనివారు కొందఱు మాత్రము నాకు బొజ్జముక్కనియు కుడికాలు యేనుగుకాలున కంటె కొంచెము లావనియు, గూనియనియు జెప్పెదరుగాని అవి యంతదోషములలోఁ జేరినవిగావని దలతును. ఆ స్త్రీవిషయము నీవు నేరున జూచినప్పుడు తెలియఁగలదు. నన్ను నిరాకరించవని నమ్మెదను.

ఇట్లు
నీదాసానదాసుఁడు
గుండు బొజ్జయ్యశాస్త్రి

ఆమె యట్లు జదివి మరల జెప్పఁదొడఁగెను. "చూచితిరా, నాయనలారా ! ఈ జాబెంత స్వారస్యముగ నున్నదో జూచితిరా ! నే నిప్పుడిన్ని మొత్తుకొనుచున్న నా ముఖము ముందిరనే ఇప్పుడే—మీరందరుఁ జూచుచుండగనే జరిగినది జూచితిరిగదా ! ఆహా ! మొగవాని మోహవార్ధిని గట్టివేయు

టకు సూత్రమేలేదా! మానవులమని యనిపించుకొనిన వా రింతటి యసహ్యామగు కార్యములఁ జేయుటయా! ఇక లేఖా విషయమును జూడుఁడు. పొరుగింటి అధికారి నేడ్పించిన మహాశయుఁడు, సాహేబును పొర్లించిన వీరాధివీరుఁడు, శెట్టి గారిని యెముకలు విరుగగొట్టిన ధీరచక్రవర్తి, కేవల మొక స్త్రీకి, ఒక యబలామణికి సేవకుఁడగుటకుఁ గారణమేమి? దాసానుదాసుఁడగుటకు హేతువేమి? కాలితోఁ జెప్పినది పాపము తలతోఁజేయవలసిన తలవ్రాతయేమి? ఇన్నిటికిని యాతని నిట్లాడిపించినది సిగ్గుబిడియములులేని మోహమేగదా! ఇతని యాకారాదివిషయములఁ గూర్చి యాతఁడే వ్రాసిన వ్రాతనుబట్టి మీరుగ్రహించియేయుందురు. ఔనౌను నతఁడేమి చేయఁగలఁడు. "చ. కరముకృశించి కాల్ విఱిగి కన్నులుగానక పుచ్ఛహీనమై। పురుగులుగ్రమ్ముచున్న వ్రణపుంజము మేనల మంగ నాకటం। బరవశమై ఘటీముఖ కపాలగళంబగు కుక్క పెంటితో। నరుగుచునుండ..." అతడెంతటివాఁడు, ఔరా! బొజ్జముక్కటా! యేనుఁగుకాలునకన్న లొంచెములావుకాలఁట, గూనియఁట, అతనికిగూడ స్త్రీలపై వలపఁట. స్త్రీలపై కాంక్ష యనునది మిమ్ముల నెంతవఱకు దెచ్చుచున్నదో గమనించితిరా. మీయబలాటమనుసరించియే అంగళ్ళలోగూడ, మీకు టోపీలువేయుటకై—మీకు కత్తిలేకనె సర్వాంగక్షౌరముఁ జేయుటకై—మీ కన్నులలోఁ దాల్చిన మొత్తని పిండిగొట్టు టకై—మిమ్ము దివాలదీయించుటకొఱకై—స్త్రీల నెక్కించి

నారు. అచ్చట లెక్కలువ్రాయువారు వారే—లెక్కబుచ్చుకొనువారు వారే— లెక్కించువారు వారే—లెక్కబెట్టుకొనువారు వారే—లౌకికజ్ఞాన మెఱిగి మాట్లాడువారు వారే—లాఘవముగ మీవద్ద బెరుకువారు వారే—లాలించి బేలించి మిమ్ము మోసపుచ్చువారు వారే—కడ కాయంగడిలో వారు లేనిచోటులేదు. వారు మీబోఁటి మహానుభావులు లోన యడుగుబెట్టినదే, మీగుణములు వారెఱిఁగిన వారగుటచే యేమి జేయుచున్నారో మీకు తెలియదా నన్ను మరల జెప్పమనదెరా, జెప్పెదను వినుఁడు. వారు పండ్లిగిలించుచు, ఓర చూపుల మీపై విసరివైచుచు, చేతులఁద్రిప్పుచు, కిల కిల నగుచు, తన వేణిని ముందు వెనుకల నాడించుచు, గిఱ్ఱునదిరుగుచు అడుగులట్టె నాట్యసరణినిబెట్టుచు, మీ ముందునకువచ్చి తమకేమిగావలయునండీ యని తన నిజమగు కంఠధ్వని నణచుకొని సన్నగ—తిన్నగ—నొయ్యారముగ—నడుగుసరికి మీ పని మూలబడునట్లయిపోయి మీ రెందుల కచ్చటికిఁబోతిరో నేవస్తువడుగవలయునో మఱచి త్రైతక్కగ మాట్లాడుచు యేదో యొకవస్తువడిగి, రెండుకాసులవస్తువు రెండురూప్యములకుఁ బుచ్చుకొనుచున్నారుగదా! మఱికొంతమంది అచ్చట వారేమిచ్చిరో వారేమడిగిరో ఆమె యెంతడబ్బిచ్చెనో, బైటపడి యరమైలు బోవునంతవఱకు మైమరచి తర్వాత తనచేతులనున్న వస్తువులఁజూచి ముఖము వ్రేలవైచుచున్నారు. ఒకపర్యాయము ఒకయువకుఁడు అట్లే యంగటిలోనున్న నొక యువ

తిని జూచుచు తనకెదురుగ నేదో వస్తువులం గొనివచ్చుచున్న ఒకయుద్యోగస్తునిజూచి యతఁ డెవరని, యేమియని, యను కొనకయే, మీ వద్ద జావాసిల్కు దొఱకునాయని యడిగి నాఁడు. యతఁడును యాతని కాలోప మెందువలన గలిగినదో గ్రహించక ప్రక్కన నున్న యువతిమ్రోల యవమానము గలిగినదని కన్నులెఱ్ఱజేసికొని (You stupid, You fool) నీకంత కావరమా నీపై మానసష్టపుదావా దెత్తునని గొంతు బొంగుబోవునటుల యఱచినాడు. ఆహాహా! మోహామగ్న మానుసులగు వారికే యడను కీడేమోగదా! ఒక డ్రామా యందు ఒకస్త్రీ హార్మోనియం వాయించునని పురుషులు కిట కిటఁజేరిరి. ఆట యారంభమయినది. సూత్రధారుఁడు వచ్చి అనాథుఁడనుగాను యనుపాట పాడుచుండ యామె హార్మో నియం వాయించుటకు జేతగాక తాను చిన్నప్పుడు నేర్చు కొనిన పిళ్ళారిగీతములు వాయించుచుండెను. మనవా రందరు ఆమె ముఖమట్లె నోర్లుదెఱచి జూచుచు యామె యేమివా యించుచున్నదో గ్రహించకయే సెబాష్, సెబాష్, వన్సు మోరు యని యఱచుట కారంభించినారు. ఇంకను మీచేష్ట లనుగూర్చి జెప్పుదునా? మీకప్పటికైనను లజ్జాభిమానములు గలుగఁబోవునా! ఓ యిట్లే, యిట్లే మీ యవ్యక్తములగూర్చి యెన్నియైన జెప్పఁగలను కొంచెముశ్రద్ధగనాలకించుఁడు. దలఁచు కున్న నవ్వాపుకొనుటకే లేదే ఒక మహానీయుఁడు మోహా పరవశాలాలసమానసుండై పుట్టింటనుండిన తన భార్యకు

జాబు వ్రాయసమకట్టెను గాని దిక్కు దోఁచలేదు. రసవంతముగ—కామోద్రేక ప్రపూరితముగ—వుద్రేకయుక్తముగ—వ్రాయవలయునని యనుకొనెను గాని పాపము భాషాజ్ఞానము బహుతక్కువయగుటచేఁ దాను చదువుచుండిన ఒక నవలలో ప్రియుఁడు ప్రియురాలికి వ్రాసిన లేఖనుజూచి చంకలెగురవైచి—పండ్లిగిలించి కండ్లెల్ల తేలవైచి—ఆజాబుయొక్క ప్రతినొకటి వ్రాసి తపాలులో బడవైచినాఁడు. ఆ లేఖనుజూచినదే తనసతి పరుగుపరుగున బరుగిడి వచ్చునని దలచినాఁడు, కాని మూడవ దినము కోమలికి బదులుకమ్మ ప్రత్యక్షమైనది. ఆ జాబువిప్పి "నీముఖముమండ, నీ పాడుమూతికి మఱియొకమిటారి గావలయునా, ఈ వయస్సునకు వరకాంతా యాహ్వానపత్రికలా, మా పక్కయింటి మదనవతికి జాబువ్రాసి పొరపాటున నా విలాసము వ్రాసితివా, యెన్నిదినములనుండి యీదొంగాటలు? నే నచ్చటికి రానిమ్ము నీకు సమ్మార్జనీసన్మానము గావించెదను" యని జదివి ముఖము తెల్లఁబోవ తన పొరబాటును కనుగొనెను. నవలలోనుండిన జాబును కాపీయెత్తినప్పుడు ఆలేఖ మొదటనున్న మదీయమోహనాంగియగు మదనవతికి అనువాక్య మట్లే వ్రాసినాఁడు. మదనవతి యనుపేరును మార్చి తనభార్య పేరు పొందుపఱచుట మఱచినాఁడు. ఇంత తలతిక్క యేలగల్గినదో యూహించితిరా, కేవలమొక్క మోహాతిశయమువలనగదా, మఱియొక మహాశయుఁడు తన భార్యకు వ్రాసిన జాబునందు ఓనాహృదయపుమెండా, దట్ట

ముగ గ్రమ్మియుండు మేఘములఁ బారద్రోలు ఓనామారుతమా, నా ప్రేమ నీ యెడ శీతలము గానేరదని నమ్ముము యని వ్రాసెను. ఇందులకు బదులుగ తాము వ్రాసిన (Weather report) వాతావరణస్థితిఁ దెలుపుపట్టిక వచ్చి చేరినదని యామె వ్రాసినదట. ఇట్లు పిచ్చిపిచ్చిగ వ్రాయు టెందులకు? ఇట్టిజాబుల స్త్రీలుజూచి మీలోఁగల బలహీనతను కనుగొనరా! పోసి పోసి మీ కిట్టి యవ్యాజమగు ప్రేమ మీ సతులపై కలకాల మంటగట్టుకొనియుండునా అనుకొనిన అది యును లేదు. కారణమేమన మీరు నిశ్చలముగల ప్రేమతో మీ సతుల బెండ్లాడినగదా, ధనసంచయములకు మోజుపడి, యుద్యోగమున కాశించి, విద్యకొఱకు దేవులాడి, తండ్రిని సంతోషబెట్టుటకు—తాతముచ్చటదీర్చుటకు—దెచ్చిపెట్టుకొనిన ప్రేమ శాశ్వతముగ నుండునా? అందువలననేగదా మీ ప్రేమ పక్షివలె ఒకచెట్టునుండి మఱియొకచెట్టునకు రివ్వున నెగిరి పోవుచున్నది. వివాహముతోగూడ మీరంగు మారిపోవు చున్నది. మీలోని కళకళ లంతరించుచున్నవి. మీలోనున్న స్వాతంత్ర్యమడుగంటుచున్నది. ఒకయూరియందొక యామెకు ఇరువురు కుమారులుండిరి. ఇరువురికిగూడ నుద్యోగ వివాహ ప్రాప్తిసిద్ధించినది. ఒకఁడు వేలూరునందును మఱియొకఁడు మాలూరునందు యుండిరి. అందరును వారితల్లి చాలయదృష్టవంతురాలని యనుకొనెడివారు; గాని యామె వేలూరికిఁ బోయిన "అమ్మా మాలూరికిఁ బోరాదా" యని యా కుమా

రుఁడును, మాలూరికిఁబోయిన 'తల్లీ వేలూరికిఁబోరాదా'యని యాపుత్రుఁడును భార్య పీడితమానసులై జెప్పుచుండెడివారలు. ఆమె యీ యూర్ల ప్రయాణముఁ జేయఁజాలక కాబోలు కృశించి పైయూరికి ఒకేతూరి పయనమయ్యెను. (నా భార్య అత్తగారి విషయమున Irritable యనియు నా భార్య ఆ విషయమున Self starter అనియు కేకలు) చాలును ఇక చాలును. నిలువుఁడు మీలో గురుత్వము లేనప్పుడు—మీలో న్యాయ మగుపడనప్పుడు,—వారాడినట్లెల్ల మీ రాడుచున్న ప్పుడు,—వారికృపకు పాత్రులగుటకు యెన్నెని యిడుములనైన బడుట కిచ్చగించుచున్నప్పుడు,—వారి పాదాక్రాంత లగుచున్న ప్పుడు (వారు మా వస్త్రము లుతుకుట కేవగించనప్పుడని జేర్చుఁడు, కాదు కాదు పాత్రలనుదోమి కాపీబెట్టుట కిచ్చ గించినప్పుడని జేర్చిన మఱియు బాగుఅని యరవులు) కానిండు. మీ పెద్దరికములను గూర్చి మఱియొకతూరి ముచ్చటించె దను. అయ్యలారా వింటిరా ! నేను జెప్పిన దంతయు విం టిరా ! లోకమున మీకీయపవాద మెందులకు, మీ మగువల మాటలువిని యెంతకీడు లోకమునకు గలుగఁజేయుచుంటిరో గ్రహించితిరా? చక్రవర్తులుసహితము స్త్రీలకుదాసానుదాసులై దేశముటెట్లు నాశనముగావించిరో—తోయలిపలుకులవిని తల్లిని గూడ జంపుటకు వెనుదీయకుండిరో—యనేకసంసారము లెం దులకు నిర్మూలము గావింపఁబడుచున్నవో—మీ మేలు గోరు వారెందరు మిమ్ముల నేవగించుచుండిరో—మీ తల్లిదండ్రులు

సోదర సోదరీమణు లెందరు మీ కొఱకై యెమ్మలయిపోవు చున్నారో—మీ సేవక బృందములు మిమ్ములెట్లు పరిహాసించు చున్నారో—మీ జీవితము లెట్లునశించి కృశించుచున్నవో యిప్పటికైనను గ్రహించుఁడు. కొంచెము కొంచెముగ మీ పాలతుకలపూజ (Women worship) తగ్గించుడు. అప్పుడు ప్రపంచ మంతయు కొంచెము సుఖించును. ఆఁడదానిని, మీ ముంగల యున్నవదరితిని, యేమి గర్వమని దలవకుఁడు. మీ మేలుగోరి, లోకకల్యాణ మభిలషించి, మా స్త్రీలలోగల లోపముల దిద్ద నిచ్ఛగించి, మీరు బాగుపడుటఁగోరి యిన్ని జెప్పితిని. ఆ సర్వేశ్వరుఁడు మీ కీబుద్ధిని మాన్పుటకై తగు బలము నిచ్చుగావుత! ఓం, శాంతి, శాంతి, శాంతిః



౭

## పకోడిముక్క పైపగ

నాయనలారా! నేఁటి ఉదయము నన్నగ్రాసనాధిపతిగ నాహ్వానింప మీ కార్యదర్శి నా యొద్దకు వచ్చినప్పుడేవిషయమును గూర్చి యీ విద్యార్థిసభయందు ముచ్చటింపఁదలచిరో నేనడుగమఱచితిని. సరిగదా నాకంటెఁ గుశాగ్రబుద్ధి గల మీ కార్యదర్శి గూడఁ ఆవిషయమును గూర్చి జెప్పుట మఱచి నేను వచ్చెదనని తల యూఁపినంతనే సమస్త కార్యములు నిర్వహించినంత సంతసమున నొక్క గంతువైచుచు నొయ్యారముగ వెనుదిరిగియైన జూడక నిష్క్రమించెను. సభోద్దేశమెద్దియో అడుగఁదలఁచి తలపై కెత్తులోపల నతఁడు మా వీధినుండి యదృశ్యుఁడై యుండె. విషయ మేమియు చర్చింపని పట్టి సభయో, కాకున్న నల్పాహారసమాజమో (Tea party) యేమో, కార్యదర్శి పలానిదని పలుకకపోయెనే యని యీ లేకున్న కాకున్నలతో సుమా రొక గంటవఱకు నాలో తీవ్రచర్చ జరుగుట మానలేదు. కడకు టీపార్టీయే యుండునని నా యంతకు నేను కృతనిశ్చయుఁడనైతిని. అంతలో మఱియొకసందేహము గలుగకపోలేదు. టీపార్టీయే అయినచో అగ్రాసనాధిపత్యము వహించుటకై యెందఱో మహానుభావులు, ఘటోదరులు, వృకోదరులు, కుడితికడుపువారు, ఖండ

గోళాకృతినొందిన కడుపుకలవారు, రుచుల రూపెఱిగినవారు, నేను ముందు నేనుముం దని త్రొక్కులాడువా రెందఱో యుండఁగఁ దగుదునేమో యని నన్నాహ్వానించుట యం దేమో పరమరహస్య మిమిడియుండవలె ననుకొంటిని. ఈ టీపార్టీలమాట వచ్చినప్పుడు కొంచెమైనను జెప్పకుండుట మంచిదిగాదు. ఈటీపార్టీల టాటోటులచే టోపీలు వేసుకొనని నీటుకాండ్రు గనబడుటలేదు. నాయనా! యీ విచిత్రపు టీపార్టీలతో మన పూర్వీకు లెప్పుడైన తంటాలుపడుచుం డిరా! అట్టిమాటలైన వారు వినియుండిరా! ఆ పదమే మన భాషలోనిది కాదుగదా! టీపార్టీలకై యింత ప్రాకు లాడుచుంటిరే, టీ అను మొదటిది తీసికొనుఁడు. సాయంకాలము, అసురుల తిండివేళ—భానుం డస్తగిరి నలంక రించువేళ, సాయంసధ్య ననుష్ఠించువేళ—మీరు గూర్చుండి, మీరు కాదు నాయనలారా! మీ రందరుకాదు అట్లు, షోవు మహానీయులు పండ్లిగిలించుచు ప్రాణప్రతిష్ఠఁజేయు వారివలె గూడి నటించుచున్నారే! ఓహో! అలనాడు దేవదానవులు పాలవెల్లి జిలుకుచున్నప్పుడు గలిగిన ప్రళయాంతక విషానల మును కంఠమున నిలిపికొనిన కైలాసాధిపతిని ఈశ్వరుఁడన వలెనో లేక అసురులకేమియు పీడదగులనీయక తామే యా పీడను కడుపున నింపుకొనుచున్న మిమ్ముల నీశ్వరులనవలెనో తోఁచెడిదికాదే! విషానలజ్వాలలచే నాతని కంఠము నీలిమ మైనది. యీ టీ విషాగ్ని మీ కాయముల గలికమునకైనఁ గండరములు లేక దహించుటచే, సన్నమైపోయినది!

ఓ మీారే ఈశ్వరులు! ఈ టీ వలన మీా కేమైన సుఖమున్నదా! జఠరాగ్ని ప్రకోపించు వేళ నింత దీనిని పొట్టకుఁ బోసికొనిన మీాకు గలిగిన పురుషార్థమేమి? రాత్రుల మీాకు నిద్రయా! అది సున్న గదా! ఆ నాడు రాత్రి యంతయు తలగొట్టుకొనినను కనుఱెప్పలుపై గుండ్రాళ్లు పెట్టినను అవి మూతలువడక తస్కరభీతి మాన్పిన పుణ్యమార్గమున బోవునుగదా! ఉదయమున మీా ముఖముల చూచిన నెట్లుండునో! నేను జెప్పవలెనా! నిన్న సాయంకాలము అసురులతోఁ గలియఁబోయి, యింతశీఘ్రమున నసురరూపము రాకపోయినను దాని తమ్ముని స్వరూపముఁ దాల్చినట్లుందురే.

ఈపిచ్చిపిచ్చి పార్టీలవలననే మన భారతమాత భాగ్యము ఫలింపకున్నది. ఎడతెగక పార్టీలపై పార్టీలు జరుగుచున్నంతవఱకు భిన్నాభిప్రాయములు కలుగకుండుట కల్ల. టీపై టీ, మీా పొట్టలకు పోయుచుండునంతవఱకు మీాకు సుఖము చేకూరుటయు సున్న. ఫలితములేని ఇట్టి అవకతవకపు పార్టీలు మన కేల? పశ్చిమదేశవాసులు చేసిన పనిని మనముగూడ చేయవలెనా! వారిదేశము బ్రతికియుండఁగనే రక్తము గడ్డ కట్టునట్లు చేయునంతటి శీతలదేశము. అట్లుండు కారణమున వారు వెచ్చని తేనీటిని బుద్ధిని వికసింపఁజేయగలందులకై చిన్నచిన్న సభలలో నహితము కొంచెము కొంచెము పుచ్చుకొనెదరు.

వారిని జూచి మీరుకూడ వేడి తేనీటిని బోసికొనిన, మీ గతి యేమికావలయును ? బ్రతికియుండగనే రక్తము మాడ్చు నుడుకులో జచ్చుచుంటిమే. అందుపై యీ యుడుకు గూడనా ! సరి సరి ! మీ ప్రారబ్ధ మిప్పటికి నా కవగతమైనది.

శరీరముపైన వేడిమి శరీరములోపల వేడిమి నెత్తిపైన వేడిమి కాలిక్రింద వేడిమి యుండినఁగాని త్వరగ మోక్షప్రాప్తి కాదా యని ఈనూతన వేదాంతసూత్రమును కనిపెట్టితిరా ! తెల్లదొరలుచేసినట్లుమనముకూడా జేయఁజెల్లునా? వారేదిచేసిన నెట్లు జేసిన నీవది యట్లేచేయవలయునా? మీ రిన్నిమార్పులు కనఁబఱచుచున్నారు. నీవు భారతీయుఁడవా అని వైద్యునిదా నమున బరికించినగాని తెలియదే ! ఆఁడుదానికైన పాపటపై వెంట్రుక చెదరునుగాని మీకుఁ జెదరదే ! ఉగ్గుపాలతోఁగూడ నీకు పశ్చిమఖండ పద్ధతు లలవడుచున్నవే, ఆహారమునందేమి నడచు వైఖరినందేమి నీతియందేమి భాషయందేమి నవనాగ రికత యందేమి వారి ననుకరించుచున్నారుగదా ! వారికన్న మీరే పశ్చిమఖండవాస్తవ్యులుగ నగపడుచున్నారే ! వారు గూడా మిమ్ముఁజూచి భయపడుచున్నారే ! ఈ దేశమునఁ బుట్టి ఈ దేశమునఁ బెరిఁగి ఈ దేశసాంప్రదాయము ననుసరిం పవలసిన పనిలేదా ? మీకు మీ దేశ మెచ్చటనున్నదియు నే పేరు గలదియుఁ దెలియదుగదా !

పులినిచూచి నక్క వాతలు బెట్టుకొనిన దనునార్యోక్తి నీ బోఁటి మహనీయులవలన సార్థకము కాకున్న దానిబ్రతు

కెట్లు ! పోనీ. ఇన్ని వేషములు వేయుచుంటివే ! ఎవరినిజూచి నీవీవేషము వేయుచుంటివో వారెన్నడైన మీా వేషమును మిమ్ము వెక్కిరించుటకైన దమ వేషమును మార్చుచున్నారా! ఈ దేశమున అననేల ప్రాంకులసహితము మలమల మాడ్చి వేయు మెసపోటోమియా కాదుగదా. మఱి మెజామెబిక్ దేశమునకుఁ బోయినను దమ నిజారును దీసివైచి వేడిమి కనుకూలమగు మన దోవతిని గట్టుచున్నారా ? ఎందులకట్లు వారు చేయుట లేదో యెప్పుడైన యోజించితివా ! పాపము యోజించుటకు నీకు వ్యవధియెక్కడ? నీ టాకుటీకు చూచుకొనుటలోఁ బ్రొద్దు పోవుచున్నది. వారికి దేశాభిమానమందు, వారిమతమునందు వారి నడవడియందలి వారికిఁగల ప్రేమ యెట్టిదో ! ఇప్పుడైనఁ దెలిసికొంటివా ? ఇతర వేషములు వేయుట వారి గౌరవమునకు లోపమని, వారి దేశమున కగౌరవమని, వారి సాంప్రదాయమునకు సరిగాదని, రోతయని వారు ధరించుటలేదు. ఈ దేశమున హిందువుఁడనఁ నెట్టి వాఁడు ! వాని పూర్వమెట్టిది. చూచెదమని వాడవాడకుఁ బోయినను కానరాఁడే ! నీవేషము కాలిపోను, నాటకశాల లోనైనను హిందూ వేషమైన జూచెదమన్న క్రాపింగులేని తల గనబడదే! హిందూ సాంప్రదాయ చిహ్నములైనఁ గన్పట్టవే! దశరథ పాత్ర ధరించిన ఆనందరావు శ్రీరామచంద్రుఁడు వనములకుఁ బోయెనని విని యేడ్చి యేడ్చి యెండుకొనిపోయిన గొంతుకను సోడాతప్ప నింకేదియు నయము చేయఁజాల

దనియే తన దుఃఖమును వెల్లడించునే! దుష్యంతపాత్రము ధరించిన రామచంద్రయ్య తనచేతిగడియారము పలుమారు చూచుకొనకున్న తన రాజపాత్రము రమింప దనుకొనునే! ఇన్ని పైవేషముల వేయఁగలిగితివిగదా లోవేషమును గూడ వేసియుండిన గొంతవఱకు బాగుగా నుండెడిదే. పైవేషములవలన మీకేమైన లాభమున్నదా!

సమయానుకూలముగ వారికిఁ గలుగుచుండెడి ఐకమత్యము, కార్యములపట్ల వారికిఁగల పట్టుదల నేర్చుకొన బని లేదా. ఔనౌను! మీ రెట్లు నేర్చుకొందురు! నీ మనస్సున కవినచ్చునా? పకీర్లనుగా మార్చివైచు వింతవింతవస్త్రధారణము చేయనేర్తువు. లేని యహంకారముఁ దెచ్చిపెట్టు రకరకపు హ్యాటు, బూటు, సూటు ధరింపనేర్తువు. నీ సత్తువ సున్నజేయు సిగరెట్టును ఒకగ్రుక్కెడు పీల్చి ఆ ధూమముచే సూర్యునికి ధూపము వేయఁగలవు. ఒక్క తృటిలో రూపుమాయు సీతాకోక చిలుకవలె పలురంగుల వేషము వేయగలవు గాని నీ దేశము బాగుచేయ, నీ దేశమునకుఁ దోడ్పడఁగాదు. కాదు నాయనా! ఎంతటిమాట యంటిని అంతటి పుణ్య మెన్నిజన్మములకుఁ గలుగును? కడకు హిందూదేశనివాసి యనిపించుకొనుకొఱకైన ప్రయత్నపడవు గదా! పూర్వ మెప్పుడో బ్రాహ్మణుఁడువచ్చి తిథివారనక్షత్రము లేర్పఱచినఁగాని క్షురకర్మ చేయించుకొనరని మా ముత్తాతగారు మా తాతగారితోఁ జెప్పుచుండగా మాతండ్రి

గారు వినియుండినట్లు నాకుఁ జెప్పుచుండెడివారు. ఇప్పుడు మంగలి తన సౌకర్యము చూచుకొని శనివారమో అమవసనిశయో నీ వాకిట జేరి వచ్చితినయ్యా! అని వీధిముంగల నొక కేక వేసినంతనే ఆ వఱకే మూఁడుసారులు మెక్కి నిదురించుచున్న నీవు గబాలున లేచి దబాలున తలుపుదెఱచి వాఁడు పిలిచిన సమయమే మంచి ముహూర్తమని, వాని చంకలోనున్న యడపమే పంచాంగము కట్టగా భావించి క్రొత్తపెండ్లికొడుకువలెఁ గూర్చుందువే! నీ సొగసు సొట్టగాను! మన పూర్వీకులేల క్షురకర్మకు తిథివారనక్షత్రము లేర్పఱచిరో తెలిసికొన వలదా! క్షురకర్మ కాయుష్కర్మయని పర్యాయపదమున్న దని యైన నీకుఁ దెలియునా! మంగలి మంగన్న మండపాక మంగన్న శాస్త్రి యైనప్పుడు నీకావిషయము తెలిసికొనవలసిన యగత్య మేమున్నది? నాయనా! మఱచి తిని! నీవు పశ్చిమఖండవాసుల ననుకరించు మహానీయుఁడవు గదా! నీకీ దేశసాంప్రదాయముపై నంత యభిమానమా! కలియుగాదినుండి గౌరవనీయమైన గంగానది యెచ్చట నున్నదో నీకుఁ దెలియదుగాని గాల్ దేశములోనున్న గరోని నదిని గూర్చి చక్కఁగఁ దెలియునే! నీ దేశములోనున్న హిమాలయపర్వతముల మహిమ తెలియదు గాని యెచ్చ టనో యే మూలనో యున్న హ్యామిల్టన్ పర్వతముల తత్వము బాగుగాఁ దెలియునుగదా! మాటమాట్లాడిన మాం

చెప్టరుమాటయే గాని మాధవుని బాలక్రీడాభవనమగు మథురమాట తలపెట్టవుగదా? ఓంధ్రపెట్టుట కారంభించిన ఆక్స్ఫర్డు సుద్దియేగాని ఆంధ్రవీరులకు పుట్టినిల్లగు ఓరగల్లుమాట మఱచిపోతివిగదా! స్మిత్తుదొరగారు వ్రాసిన హిందూదేశ చరిత్ర దప్ప సీతారామయ్యగారు వ్రాసిన చరిత్ర ముఖమైనఁ జూడవే! తామ్సన్ వ్రాసిన గ్రంథము నీకు త్రికాలపఠనమున కనువయ్యెనుగాని తిక్కన సోమయాజి వ్రాసినది త్రిప్పియైనఁ జూడకపోతివే! మిల్టన్ వ్రాసిన తత్వము చీకాకులేక చూచినట్లు సీతారామాంజనేయము చూడఁగలవా? పీకాక్ కవి వ్రాసిన పద్యరచన కానందించితివి గాని పోతన కవితా మాధుర్యము నెప్పుడైనఁ జవిగొంటివా! బ్రౌను గీతముండఁ భగవద్గీత తలఁపునకైన రాలేదుగదా! సీజరుముందు శివాజీ పనికి రాకుండఁ బోయెగదా! ఓ యిట్లని యెన్ని చెప్పగలను.

షేక్స్పియరుపైఁగల ప్రేమ శేషశయనునిపై నిలిపిన యెంతయో కృతార్థుడై యుందువే! మోసెస్‌పై నను్న మమత ముకుందునిపై నిల్పఁగూడదా! వారు నీకుఁ జేసిన సన్మానములేవి? వీరు చేసిన యపకారములేవి, వారి పెండ్లిండ్లకు నిన్ను పీకదీసి పీటలు వేసిరా? వారి అంతరంగిక సభలలోని కడుగైన బెట్టనిచ్చిరా? వారి మంత్రాలోచనా సభలలో నీ మంతనమునకై నిరీక్షించిరా? కడకు వారికొంపలలో జరుగుకార్యములకై నిన్నాహ్వానించిరా? వారి ననుకరింపనేల యిట్లు ప్రాఁకులాడెదవు? వారికున్న స్వాతంత్ర్య ప్రేమ నేర్చు

కొనుట మానివైచి షార్టుకోటులు, స్టాకింగ్సు, దగిలించుకొన
నిచ్ఛగించితివే! వారి మాతృభూమియందు వారికిఁ గల
ప్రేమను గనుఁగొనక వారి దేశపు మఫ్లరు మెడమీఁద మాటించు
కొనుట మానవైతివే! వారికిఁగల ఐకమత్యము నేర్చు
కొనఁబోయి ఇండియామాటయే మఱచిపోతివిగదా! వారి
వలె నీవు వేషము వేయదలంచితివే అది నీకుం సాధ్యమా
అసాధ్యమా అనుట యోచించితివా? వారు మూఁడుమార్లు
మెట్రిక్యులేషన్‌లో కృతార్థులుగాకున్నను వారికి మాసమునకు
మున్నూరు రూప్యములకు తక్కువముట్టదే. మీరదే పరీక్ష
యందు తీర్ణులైనను పది రూపాయలైన సంపాదింపలేరే!
ఇంక మీ వేషవ్యయములకు డబ్బెచ్చటనుండి దెత్తురు? మీకు
వచ్చు మీస్వల్పవేతనములో యిన్నిఖర్చులు పెట్టుకొనుచున్న
మీ భార్యాబిడ్డలు భగవన్నామస్మరణచేయుచు ముక్కు
మూసికొని తడిగుడ్డ కడుపుపై వేసుకొని మీకు క్రొత్తగా దగి
లిన ఈ ముసరజాడ్యము మాన్పు దేవుఁడా యని మునివృత్తి
యవలంబింపవలసినదేగదా, నాయనలారా! అసలు కెంపు
రాతికున్న గౌరవమిమిటేషనుకున్నదా! నీవు మాత్ర మిమి
టేషను దొరవు గాకుము. ఓహో అదేమితంద్రీ! ఆ మూల
నున్న ఒక్క విద్యార్థి చేతిలో గారడివానియొద్ద నున్న కొంకరి
కొయ్యవలె నొకటియున్నదే? అతఁడింత చిన్నతనములో
గారడివిద్య నభ్యసించినాఁడా! (కాదయ్యా! కొంకిరికొయ్య
గాదు. అది హ్యాకీబ్యాట్ అని కేకలు) ఓహో! హ్యాకీబ్యాటా!

మంచిమాటచెప్పితిరి. పూర్వము హిందువు లేర్పఱచిన హైందవ పారిశ్రామికపద్ధతులకన్న హాకీ యాట మిమ్ము హాలికుల కన్న నెక్కువ జేయఁగలదా! ఒకరువ్వ యయినను కర్చు గాక దేహపరిశ్రమ చక్కఁగఁ గలుగఁజేయు మనదేశపు టాటలు మూలబడినవి. తొంబైరూపాయలు కర్చుబెట్టి టెన్నిసాట యాడినఁగాని తిన్నదియఱుగదా? తలగుడ్డనిలవదా? బల్గుడుముండఅ బ్యాటాట యంత శ్రేష్ఠమా! ఔనౌను నాయనా! కాసుకర్చుచేసికొనిన పెంకుపై మోజు పూరక వచ్చిన వజ్రముపైఁ గలుగునా! కాని తండ్రీ! నీకుఁ గలిగిన చిత్తచాంచల్యములో నింకెన్ని రెమ్మలు గలుగునోగదా! నాయనలారా! మీ దేశమున ఆదినుండి మీకు సేవసేయుచు మీ పంచనుబడియున్న పంచముని జూచినంతనే పండ్లు పటపటఁగొఱికి మీ రేపామునో జూచినట్లు పాఱిపోయెదరే. ఆ పంచముఁడే పాపయ్య యనుపేరున నున్నంతవఱకు నాతనికి నీ వలన నగచాట్లు దప్పవే! పాపయ్య పేరు పాల్గేగా మాఱినవెంటనే పండ్లిగిలించుచు పరమపావనుఁడైనట్లు వానిని కౌగలింతువే! పాపయ్య పాల్గేగా మాఱినపుడున్న యభిమానము పాల్గే పాపయ్యగా నుండినప్పుడే చూపరాదా? ఎంత పేరుమాఱినను రూపము తత్త్వము మాఱలేదే! మఱి మారిన దొక్కటేగదా! హిందూమతమునకు యంజలియొసఁగి పరమత స్వీకరణ మొనర్చినవెంటనే ఆ పాపయ్యకు మీ వలన నెంత సన్మానము దొఱికినది! మీకు మీ మతమునందే యంత

గౌరవములేదా! వారంతయు పీటర్లో, జాన్లో, అయినపక్షమున మీ బ్రతుకేమగునో యోజించితిరా. మీకా సిగరేటుకాడ పట్టుటకు దెలియునే గాని మడకకాడఁ బట్టుట తెలియునా? కాపీనీళ్ళు తోడుకొనుటకుఁ దెలియునుగాని కపిలతోలుటకుఁ దెలియునా? సారాయిబుడ్డి పట్టుటకుఁ దెలియునుగాని సాలు పట్టుటకు, దెలియునా? నెక్ టై వేయఁగలరుగాని నారు నాటఁ గలరా, కాలర్లు వేయఁగలరుగాని కలుపుదీయఁగలరా? అడుకుపాత్రలో అంటులేకుండ మ్రింగివేయఁగలరుగాని అండ దీయఁగలరా! మీ బ్రతుకు బొమ్మల బ్రతుకులకన్న హేయమై బొమ్మలకున్నంతబలము గూడ లేదే! అట్టియెడ మన జీవనాధారులగు పంచములందఱు పరమతస్థు లయినప్పుడు మీ గతి యేమి గానున్నదో తెలియవలదా? వారందఱేకమై వారిని బెట్టుచున్న పాట్లు దలంచుకొని మనలను దఱిమినచో మీ బ్రతుకెట్లు! కాపీద్రావకము కడుపున కెక్కించుటచేఁ బరుగెత్తుటకుఁగూడ కాళ్లలో శక్తిలేకుండ జేసికొంటిరే, శక్తియున్నదనుకొన్న నెచ్చటికి బోదువు? కడకు నేదీవికో బోయి తలదాఁచుకొందమన్న మీకన్న ముందుగ నచ్చట నడుగుపెట్టియున్న తెల్లదొరలు అయ్యో పాపము మనవేషములు వేయుచుండిన మహనీయులే, మనమాటయే వేదవాక్యమని దలఁచిరే, అని కనికరించి మిమ్ము సముద్రము లోనికి గెంటివేయక దరిజేర్తురనుకొంటిరా! మీ దేశస్థులతో మీ రేకీభవింపక పరదేశస్థుల పరమేశ్వర స్వరూపు

లనుగ నెంచుట పరమపావనమా? మీరు స్వచ్ఛమగు హిం దూస్వరూపమును రూపు మాపఁదలఁచితిరా! భారతమా తకుఁ బుత్రులని యనిపించుకొనఁదగిన వారిని బాధించితిరి. ఇట్లే అయిన దేశనామము నశింపవలసినదే! పంచముని జూచినపుడు పుట్టిన వైరాగ్యము పాల్‌దొరగారి బొట్లరు పంపిన పాయసము పుచ్చుకొనునప్పు డెచ్చటికిపోయినది? మాలను తాకినప్పుడు గలిగిన మంట ముల్లరుదొరగారి సేవకుఁ డగు మాత్యూస్‌తో కరచాలన చేయునప్పు డుండినఁగదా! చాలుచాలునయ్యా! ఊరక నోటికివచ్చినట్లెల్ల వాగుచు న్నావు. హేయపదార్థములు భుజించు ననహ్యమానవులతో మైత్రిచేయుమనుట నీకు నోరెట్లువచ్చినదయ్యా! నీకీ చోటి చ్చినది మా బుద్ధితక్కువ అని కేకలువేయుదురా? నాయన లారా! అల్లరి కొంచెము నిల్పుడు. ఉన్నమాట జెప్పినందుల కింత రొసరొసయా! వారు హేయములగు వస్తువులు భుజిం చెదరనియా మీ భయము. అట్లయిన యీయసహ్యాపుఁ జేతలు నింకెవరియొద్దను లేవా? ఎట్టి హేయవస్తువైనను వారు చేతఁ దాకినవెంటనే పవిత్రమగు నేమో! వారు తినునది (Calcutta Hump) కలకత్తాహంవుగాని కస్తూరి హల్వా కాదే! వారు దినునది బీఫ్‌కూర గాక బాదాముకీరనుకొంటిరా! వారు చవి చూచునది చిక్కన్‌బ్రాతేగాని చింతనీళ్లుగాదే! ఒకవేళ ఈ నీయాదిమాంధ్రులు దినుచున్నారనుకొనుము. వా రనాగరీకు లనుకొనుము, వారిని దరిజేర్చి సరియగు మార్గములు బోధించి

మీ యంతవారినిగఁ గాకున్నను మీ కన్నుల కింపైనవారి నిగఁ జేసికొనరాదా? తెలియనివారికిఁ దెలిసిన మీబోటి మహనీయులు తెలియఁజెప్పవలయుగదా! పోనిండు తండ్రు లారా, పోనిండు! నాకొక్కటిమాత్రము దోచుచున్నది. సీతాదేవి కంటీరము పెల్లగించిన రావణునంతవాఁ డెవఁడైన నిప్పుడు పుట్టియుండినచో హిందూదేశమును సైతము పెల్ల గించి యే హాలెండు ప్రక్కనో వేయుమని ప్రార్థించియుందురు. ఏల యిన్ని యనర్థములు! బ్రాహ్మణుఁడు బ్రాహ్మణేతరుని, బ్రాహ్మణేతరుఁడు బ్రాహ్మణుని, మహమ్మదీయుఁడు హిందు వుని హిందువు మహమ్మదీయుని, క్రైస్తవుఁడు హిందువును, హిందువు క్రైస్తవుని, ఇట్లన్ని మతములవా రొకరినొకరు దూషించుకొనుచుండిన మనము కృతార్థులమగు టెన్నటికి? బెంజమినును జూచినపుడున్న సహనము బాపనయ్యను జూచి నపుడు కలుగఁగూడదా! థామసును జూచినప్పుడు గలిగిన యుత్కంఠత తంబిసెట్టిని జూచినప్పుడు గలుగఁగూడదా! మిల్లరుపైగల మమత మహమ్మదుఖానుపై నుండరాదా! మీలో మీకే సహనము లేకపోయిన మఱి యెట్లు? ఎన్ని దినములకైనఁ గాని మీ స్వదేశస్థుల ప్రేమ సంపాదించుకొనఁ బ్రయత్నపడినచోఁ బ్రయోజన మేర్పడఁగలదు. ఒక్కొక్కని యందు తప్పులుండకపోవు గాని వాని నంతయు మీలో మీరే సరిచేసికొనవలయును. సమయము వచ్చినప్పుడు లోన నెన్నియున్నను ఒక్క యభిప్రాయము వెలిబుచ్చవలయును.

ఇతరదేశములలో సైతము మీ వలెనే తగవులాడుటలేదా! సమయమున కొక్కటి యగుచుండుటలేదా? వారుమాత్ర మేమి దేవలోకమునుండి దుమికిరా! అందఱిలో నున్నవి యా యాటలే! మీరు సమయము తటస్థించినపుడు గూడ భిన్నాభిప్రాయులై మెలఁగెదరు. వలదు నాయనలారా! అట్లు వలదు. ఎన్నియో వేల సంవత్సరములనుండి మీ దేశమునకునుండి కష్టసుఖములలో నీతో నేకీభవించియున్న మహమ్మదీయులపై మీరును మీ పైవారును ప్రేమచూపుటకు నేర్చుకొనుఁడు. అంతవఱకు స్వరాజ్యము కాదుగదా! సంకల్పసాధముగూడఁ గాంచలేరు. ఒకవేళ అట్టి స్వరాజ్యము వచ్చినను మీ కేమిసుఖమున్నది. నాయనలారా! కడపటిమాటయందు కొంచె మోపికపట్టి వినుఁడు. మీ దేశమునందు మీరు ప్రీతిగలుగఁ జేసికొనుడు. మీ దేశస్థుల మీ సహోదరులుగ భావింపుడు. (టీపార్టీ లేదని పకోడీముక్కలగుపడలేదని కాఁబోలు నుపన్యాసకుఁడు లోనున్నదంతయు గ్రక్కుచున్నాఁడని గుసగుసలు). నాయనలారా! మీ గుసగుసలలోని సారము నాకుఁ దెలిసినది. మీరు టీపార్టీయే పెట్టియుండినచో నే నద్దాని మూచూచియైన నుండను. మన దేశపుపంట లెన్నోయుండ, ఆ టీ నెందులకు సేవింపవలయును.

ఇక పకోడీలు తేలేదని పకోడీముక్కపై పగసాధించు టకై యింతవదరితినని యనుకొనకుఁడు. అప్పుడే మీ ముఖములతోపాటు ఆకసమునగూడ మబ్బు గ్రమ్ముచున్నది. మీ కార్యదర్శి నడిగి చర్చనీయాంశ మేదో చెప్పితిరేని మీ యుపన్యాసములైన పిదప నంత్యోపన్యాసముగఁ జెప్పెద.




సంపూర్ణము

సరస్వతీ పవర్ ప్రెస్ రాజమండ్రి, 8834-34.